## శ్రీవాగ్వల్లి పత్రికా నిర్వాహకులు.

మ-రా-రా-శ్రీ రాజా శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవ మహారాజులుంగారు,

జయపురం సంస్థానాధీశులు

## ప్రధానపోషకులు.

...శ్రీ, రేబాల పట్టాభిరామరెడ్డిగారు, భూస్వామి, నెల్లూరు.

„ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు, „ „

„ గౌ- బెజవాడ రామచంద్రారెడ్డిగారు, బి. ఎ.,

శాసనసభాధ్యక్షులు, చెన్నపురి.



...లు.

...అయ్యంగార్ బి. ఏ., బి. యల్.,

నెల్లూరు

...గారు, బి ఏ., బి. యల్.,

...రు, కొమిరిక నెల్లూరు.

...రెడ్డిగారు „

...మరెడ్డిగారు, పాట్లెపాళెం.

...రెడ్డిగారు, బుచ్చిరెడ్డిపాళెం.

...రు అండ్ బ్రదర్సు, సంతపేట.

...రెడ్డిగారు, కొళ్ళపూడి.

...రెడ్డిగారు, విడవలూరు.

...గారు, బొడ్డువారిపాళెం.

...రు „

...మరెడ్డిగారు „

...రెడ్డిగారు, నాయుడుపాళెం.

035,1;9
NA

# తొలిపలుకు

ఈ కుమారవిజయము చెరువు యజ్ఞనారాయణకవి ప్రణీతము. వీరు కృష్ణజిల్లా బందరుపురవాస్తవ్యులు. భారద్వాజగోత్రోద్భవులు. సవనమ్మునొనర్చి సత తాహితాగ్నులైన బ్రి. వే. చెరువు లక్ష్మినారాయణ చయనులుగారి పుత్రులు. శాస్త్రసాహిత్య నిధానులు. చందవోలు గ్రామ వాస్తవ్యులునగు బ్రి. శ్రీ. తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రిగారికడ నంతేవాసులై విద్యనభ్యసించిరి. వీరికవితాధోరణిని బట్టిచూడ వీరిరెుుజ్జల పాండిత్యము బోధనా శక్తియు విశదమగును.

ఈ కుమారవిజయముకాళిదాస విరచిత కుమారసంభవాంధ్రీకరణము. కుమార విజయంబని గ్రంధంబునకుఁ బేరిడుటకుఁ గారణము కుమారజననంబు దనుక కాక తారకాసుర సంహారాంత వర్ణనమే, ఈబాలకవి లోకోపకారకంబులగు బలుకబ్బంబుల రచించి భాషాభివృద్ధి నొనరించెదరుగాకయని యీసర్వేశ్వరుఁ బ్రార్ధించుచున్నాఁడను.

తే. గీ. బాలకవియన్నఁ బిలచెడి పలుకెకాని
ప్రథితకవితా ప్రవాహ నిరంకుశతను
ప్రౌఢకవులకు సాటివై పఱగె దీవు
చెరువుయజ్ఞనారాయణ వరకవీంద్ర.

ఇట్లు భాషాసేవకుఁడు
...వేంకటరామానుజాచార్యులు



శ్రీ మా॥ కోమాండూరు రామానుజాచార్యులుగారు.

శ్రీరస్తు.

శ్రీబాలాత్రిపురసుందర్యైనమః.

# కుమారవిజయము.



శా. శ్రీహర్షాది విధాయకుం డుపనిషత్సిద్ధాంతభూతుండు వ్యా
మోహాతీతచరిత్రుఁడౌ కమలనాభుం డిష్టకళ్యాణ సం
దోహంబుల్ దయనిచ్చిప్రోచుతఁ గొమాండూ రన్వయా
బ్ధీందునిఁ
వ్యాహారవ్యవహారహారకలితుఁ రామానుజాచార్యునిఁ.

చ. తిరుపతిఁ బాయకుండి వినుతించినమాత్ర దయాంతరంగుఁడై
సరగున నాశ్రయార్థులకు సంతత ముక్తికలాప్రదాయియై
సురుచిరకీర్తిఁగాంచి ధర సూరినుతుండగుచున్న వేంకటే
శ్వరు చరణారవిందముల సంతతముంతు హృదంతరంబునఁ.

క. భూమ తమశ్ఛేదక ని
ష్కామ ప్రజ్ఞాన దీపకలికా కలికా
లామలతా సంధాయకుఁ
డౌ మద్గురునెంతు రాఘవాఖ్యాకు మదిఁ. 3

సీ. సహజతః పూత కృష్ణాగౌతములమధ్య
మున బందరెవ్వాని జనిపదంబు

కల్యాణనిలయ వేంకమ సోమపీథిని
కడుపార నెవ్వాని‌ఁ గన్నతల్లి
సవనమ్ములనొనర్చి సతతాహితాగ్నియై
మై నున్నధర్మ మెవ్వానితండ్రి
రామాయణాది సద్గ్రంథపరిశీలయా
నట్టివాఁడెవని విద్యాగురుండు

తే. గీ. దుగ్ధరసగోస్తనీఫల తులితలలిత
ఫలితకవితా కలాభ్యాస పరుఁడు నెవ్వఁ
డట్టిఁడ వివృద్ధిఁగనఁగ నున్నట్టిఁడ బుధ
రాజి వినతుండ యజ్ఞనారాయణుండ. 4

శా. కాళీదాస కుమారసంభవ మహాకావ్యంబునం దత్కవి
ప్రాలేయాంశు వచోనుసారముగ నాంధ్రింబందుఁ గూర్తుస్మృతి
న్మైలేయుంచనఁబోకుఁ డాఘనునకు న్నేఁగాలిదాసుండఁగా
నా లోకం బనుయాయికాఁగ దొరకు న్దప్పుంచు నెవ్వండనుఁ.

ఉ. ఏదెసనైనఁ దప్పిదము నెన్నకతప్పితినేని దూషణా
పాదము సేయకుండ దయఁ బండితులార సహింపుఁడీర ల
ష్టాదశవర్షమానుఁడయి చండికదాసుని పద్యపద్యలోఁ
బాదమునుంచెనన్నఁబదభంగమునొందఁడెయెవ్వఁడేనియుఁ

ఆ. వె. గొనములెన్నియున్నఁ గనకదొసంగుల
నెన్నునీచు లెంద ఱిలను లేరు

పరిమళాదులుండఁ బరిహరించుచుఁ జెడు
పుండు వెదకులాడు పురువులట్లు. 7

ఉ. శ్రీరమణీనివాసమగు సింహపురిన్ భువనప్రసిద్ధమున్
భూరియశస్సమంచితము పుణ్యధనైక గృహంబునౌ కొమాం
డూరుమహాన్వవాయమను నూత్నపయోనిధిఁ బూర్ణపూర్ణిమా
కైరవమిత్రుఁడై సుగుణకంధి యనందగు గోఁటవనార్యపా్రి
క్స్ఫూరిత పుణ్యవల్లరికిఁ బూచిన సత్సుమనోగుళుచ్ఛమై
ధారుణిఁబేరుఁగాంచి విబుధప్రివరుండయి సంస్కృతాంధ్రవా
చా రచనాతినైపుణికి స్థానమునై కవితా వినిర్మితి
శ్రీరమమాణుఁడై సిరివరించినవాని పదాంబుజాతపూ
జారతుఁడై తెలుంగునుఁ బ్రచారముఁజేయఁగ దీక్షఁబూనివా
గ్వీరుధ మన్ననామమున విశ్రితపత్రిక నొక్కదాని సం
చారమునందఁజేసి సరసంబుగఁ దా రచియించినట్టి నీ
రేరుహనాభపావనచరిత్రి విధాఖ్యములైన గ్రంథముల్
చేరిచి ముద్రితంబులుగఁ జేసి ధనవ్యయమెంతయైనఁ దా
నోరిచి మూఁడుమాసముల కొక్కొకమారొరు లెవ్వరేని తా
మీరహివాప్రసిగ్రంథముల నిచ్చినచోఁ బ్రచురించుచుఙ్ సదా
భారతికి న్సపర్య సలుపందలయొగ్గుచుఁ గృష్ణరాయ గో
త్రారమణోపమానుఁడయి రమ్యయశంబు గడించినట్టి యీ
ధీరున కెల్లకాలము నిదేక్రియ వాగ్లతికానువేల వి
స్ఫారిత పల్లవ ప్రివికసత్సుమనో వరగంధయుక్త తా

పారమునిచ్చి పోషించుటకు సారసనాభుని లోనవేఁడుచున్
పారెకు మామకీనమగు సత్కృతి నంకిత మాచరించెదన్. 8

క. శ్రీమానవతీరమణ
క్షేమంకర పాదయుగళసేవాపర ని
ష్కామ కొమాండూర్వేంకట
రామానుజ నామధేయ ప్రాజ్ఞవిధేయా. 9

వ. అవధరింపుము. 10

క. ఉత్తరదిశనుండుఁ గుధర
సత్తమము హిమాలయమన సాగరయుగమున్
హత్తుకొని పూర్వపశ్చా
యత్తత నిల కొలఁతకఱ్ఱ యన సాత్మకమై. 11

తే. గీ శైలసమితికి నెల్లనోషధుల మణుల
సంపదలలాగియిడ మేరుశైల మమరఁ
బృథునియానకు గోవైన పృథివి నితఁడె
కాఁడె చేపింపఁగాఁ గోఁడెదూడయయ్యె. 12

తే. గీ. అఖిలరత్న ప్రభవుఁడౌ నహార్యపతికి
మంచు చెఱుపదు సౌభాగ్యమహిమ నెపుడు
నొక్కదోషంబు గుణతతి నొదుగుఁజువ్వె
నిండు జాబిల్లి కలలలో నెఱసువోలె. 13

చ. జలధరఖండకాండముల శైలతలస్థిత ధాతురాగ సం
కులములఁ గాంచి యచ్చరలగుంపులుపొద్దికఁగుంకె సంజయు

న్జెలఁగె నటంచు నెంచుచును జివ్వున లేచి నితాంతవిభ్రమం
బు లడర మండనంబులను బూనుదు రెంతయు నయ్యగంబునన్.

ఉ. బోమెలుసింహసంహతులుపోయిన త్రోవ లెఱుంగుచుందురా
చాయను శోణితంబు హిమసంగతిమైఁ గనరాకయున్న స
త్యాయతకుంభికుంభ దలనాత్త తదంఘ్రినఖాంతముక్త ము
క్తాయిత భూమిభాగములఁ దత్పరత న్విహరించు చయ్యెడన్.

తే. గీ. ధాతురసమున వర్ణసంఘాతమమరు
మదన లేఖల వ్రాయఁగ మగల కెపుడుఁ
బ్రియము సేతురు కుంజరబిందుశోణ
భూర్జతరువల్కలమ్ములఁ బూవుఁబోండ్లు. 16

ఉ. అంబుధరంబు లెల్లపుడు నయ్యెడఁ దిర్వుచునుండఁగా నితం
బంబులయందు సౌఖ్యగరిమంబున హాయిగ నుండియుండి వ
ర్షంబుల చేతఁ బీడవడి చయ్యన మెండుగ నెండయుండు శృ
గంబులఁ జేరి యెంతయు సుఖంబుననుండును సిద్ధసంఘముల్.

మ. దరియ న్నోమ్మునవచ్చుమారుతమున న్దారుణ్య వల్కాచకాం
తరముల్ నిండఁగనూది యెల్లపుడు చెంతన్స్ఫ్రితిచేఁ గిన్నరో
త్కరముల్ పెద్దగఁ బాడుచుండ వినుచు న్దద్గ్యపద్యాళి కా
తరిఁ దానప్రిదభావమున్జెనయు నా ధాత్రీధరుం డెప్పుడున్.

తే. గీ. గండకండువుఁబోవంగఁ గరుల రాయఁ
బడిన సరళద్రుమంబులవలనఁ గలుగు

పరిమళం బాహిమాలయ పర్వతంపు
సానువుల గంధయుక్తముల్ సలుపుచుండు. 19

మ. మాలత్యాది లతాకుడుంగగత సమ్యగ్భానమా నోషధీ
జాలంబింతులతో వనేచరులు స్వేచ్ఛావృత్తిఁ బంచేషు లీ
లాలోలత్వముఁ జెందియుండ నిశవేళ స్నేహ గర్భంబుల
నైలాపేక్షయులేని దీపములుగాఁదళ్కొందు రాత్రంబులన్.

ఉ. అంగుళి పార్ష్ణిభాగముల కమ్యొడ శీతము పీడవెట్టినన్
హంగగుశ్రోణియు స్తనులు నట్టిటులాగఁగ నాతురంగ మా
స్యాంగనలార్తలైనను రయంబున నేగఁగలేక పెద్దఁగా
భంగమునంది మందగతిఁ బాపఁగనోపర నేమిచెప్పుదున్.

క. దినమువలని భయమున వలెఁ
దనగుహాలం డాగియున్న తమమును దయతో
నినువలనం గాచెడునది
తనుఁబొందినవారిఁ గావ ధర్మముగాదే. 22

తే. గీ. వాలవిక్షేప విస్ఫురర స్వచ్ఛ రుచులు
చంద్రచందనమందార సదృశములును
నై సలాంగూలతాల వృంతాలిఁ జమరు
లద్రిశాట్ఛబ్దము సమర్థ మాచరించు. 23

ఉ. మార మదానుషంగతి విమానములందిగి శృంగశీర్షముల్
సేరి ముదంబున స్మగలు చీరెల లాగఁగఁ దద్దరీ గృహ

ద్వారవిలంబిబింబములు వారిదముల్ దెర లౌచునొప్పఁగాఁ
దా రభిమానయుక్తలయి తద్ద వసింతురు కిన్నరాంగనల్.

శా. గంగాశీకరవారిపూరితము నాకస్వామి వన్యస్థలీ
రంగత్కల్ప సుమావళీ పరిమళా క్రాంతంబు కించిచ్చల
త్తుంగ క్ష్మాజచయక్షపంబగు మరుత్సూనాళి మాయించునో
లిం గాంతారచరత్కిరాతజనతా లీలావతీఘర్మముల్. 25

ఉ. సారసబాంధవుండెపుడు సప్తఋషీశులు దేవపూజకై
వారిరుహంబుల న్గిముమ భాస్వర నైజ మరీచిసంతతిం
జేరిచియూర్ధ్వభాగమునఁ జేయుచునుండుఁ బ్రబోధమెంతయు
న్గూరిమి శిష్టతచ్ఛిఖరి కూటసరస్సరసీరుహాళికిన్. 26

క. సనసాంగపరిగతుండని
యవనీధరణక్షమాత్ముఁ డని సరసీసం
భవభవుఁడు యజ్ఞభాగము
నవనీధ్రకులాధిపత్య మాతనికొసఁగెన్. 27

వ. అట్టులా హిమవంతుండు మహామహిమవంతుండై పితృసంకల్పజన్యయు సౌజన్యధన్యయు పతివ్రతాగ్రగణ్యయు నానొప్పు మేనామహాదేవిని విధ్యుక్తంబుగఁ బెండ్లియాడి నానాగుణరత్ననిధానయగు నాచానంగూడి నిజరూప యోగ్యంబులగు సురతప్రసంగంబుల నోలలాడుచుండఁ గాలక్రమంబున మనోహరయావనవతియగు నయ్యువతి గర్భంబుఁదాల్చె. 28

క. లీలావతి తాఁగనె నహి
బాలానివహోపభోగ్య, బలసూదన బా
హాలఘువజ్రాహతి బా
ధాలక్షిత లక్షణాఢ్యఁ దన్మైనాకున్. 29

ఉ. దక్షునికూర్మిపట్టి శశిధారికిఁ దొల్లిటిభార్య పంకజా
క్షేక్షణ పిత్రవజ్ఞ నయమెంచి సమాధ్యురుకీలికీలల
న్దక్షతఁగాయముం దొఱఁగి తానుదయింపఁగఁబూంచె మేనకా
కుక్షిఁబయోనిధి న్గలిమికోమలి యట్లు మహోదయంబునన్

తే. గీ. నియతయాపత్నియందు క్షోణీధ్రవరుఁడు
పరమకళ్యాణగుణయగు పట్టిఁగనియె
సత్ప్రయోగంబుచేత భ్రష్టంబుకాని
నీతినుత్సాహగుణము పెన్నిధినిబోలె. 31

తే. గీ. దెసలు విశదంబులయ్యెను శ్వసనుఁడుగత
పాంసుఁడయ్యెను పూవాన పఱగె శంఖ
రవమున కనంతరమునఁ జరాచరప్ర
పంచ సుఖహేతువయ్యెఁ దద్భవదినంబు. 32

క. బాలికచే నుపమిత పాం
చాలికచే మేన కిరణచయవిలసితచేఁ
జాలఁబ్రకాశించె విదూ
రేలాచల భూమిరత్న ఘృణిచేఁ బోలెన్. 33

వ. అట్టులకన్యారత్నంబు దినదినప్రవర్ధమానయగు

శశాంకరేఖచందంబున నందంబున మేరమీరి జ్యోత్స్నాంతరంబులగు కలాంతరంబులనుబోలె నశేషలావణ్య విశేషభూషితంబులగు నిజవిశేషంబులఁ బోషించుచుండ. 34

ఉ. బంధుజనంబు బాలికను బార్వతినాఁ బిలువంగసాఁగె నా
బంధుజనప్రియ జ్జనని భవ్యతపోనియమాభిలాషిణి
న్మంధరయత్నఁజేయఁగ ను!మాయనిపల్కఁదదాదిగాఁగనా
సింధురయానకయ్యెడఁ బ్రసిద్ధివహించె నుమాభిధానముక్

తే. గీ. పుత్రవంతుండునైన తద్భూధరునకుఁ
దృప్తినందద దృష్టి పుత్రినిఁ గనుఁగొని
మహిత సుమమధుకాలాళి మాలకరయఁ
జాతసంగతి సతమనఁ జోద్యమగునె. 36

తే. గీ. పరమశిఖచేత నొప్పు దీపంబుఁబోల్కి
గంగచేతను స్వర్గమార్గంబురీతి
సంస్కృతంబైన నుడిచేత సభ్యుఁడట్లు
పూతుఁడు విభూషితుండయ్యెఁ బుత్రినతఁడు. 37

క. గంగాసైకతవేదిక
లం గృత్రిమపుత్రికలను లలి బంతులచే
రంగారె చెలులమధ్యము
నం గేళీరసము నాన నా బాల్యమునన్. 38

క. శరదవసరమున నంచలు
సురనిమ్నగనట్లు రేయిసొబగగు తళుకుల్

నరుసమహా షధులనుఁ బలెఁ
బోరిపోరి సతినంటెఁదొల్లిపుట్టువుచమవుల్. 39

వ. అట్లుండ నయ్యంతి కసంభృత మండనంబున నా
సవాఖ్యంబగు మదకారణంబును గుసుమ సాయక కుసుమ
వ్యతిరిక్త సాయకంబునగు యౌవనంబుచేతఁ దూలికచేఁ దుడు
వంబడిన చిత్తరువుకరణి నరవిందబాంధవ కిరణ సందోహ వికసి
తంబైన నరవిందంబు చందంబున నంగం బభివ్యంజితంబయ్యె
నయ్యెడ: 40

తే. గీ. నమలినాభ్యున్నతాంగుష్ఠ నఖసుమముల
నొత్తియుంచుట రాగంబు నుమియుచున్న
యట్టులున్నట్టి తన్వంగి యడుగులందె
నవ్యవస్థ స్థలారవిం దాధిక రమ. 41

తే. గీ. అయ్యవనతాంగి పాదద్వయంబునందుఁ
జెలఁగుమంజీర సంజాత శింజితంబు
మరల నుపదేశమాసించి మహితగతుల
నంచలాశిక్షిత నొనర్చెననఁగ నొప్పు. 42

తే. గీ. వర్తులతకల్గి యానుపూర్వ్యంబునెనయు
జంఘ లింతికిఁ జూడంగ శంకఁగూర్చుఁ
దదితరాంగ వినిర్మితి ధాతృరచిత
నవ్యలావణ్య సముపార్జనావిధమున. 143

క. కుంభికరమ్ములు మోచా
స్తంభంబులు కర్కశత్వ శైత్యత్వములన్
అంభోరుహాననోరు
స్తంభంబులతోఁడఁ బోల్ప సరిరావుబలే! 44

క. అనవద్య పిరుఁదు దీనం
గనుఁగొనఁదగు కాంతిగలది కడపట నితరాం
గనలకును నకమనీయం
బనఁదగు నంకమున గిరిశుఁ డారోపింపన్. 43

తే. గీ. తన్వి నతనాభిరంధ్రంబు దరిసి రోమ
రాజి రాజిల్లె నీవ్యతిక్రమణమంది
మానినీరత్న మేఖలా మధ్యభాగ
మణిసితేతరకాంతి సంభారమనఁగ. 46

తే. గీ. లలివహించును వేదివిలగ్నమధ్య
మధ్యమునమూఁడు వళులు సంపన్నములయి
చెన్నుగానెక్క-యావనశిల్పి నిల్పి
పంచబాణున కిడిన సోపానములన. 47

తే. గీ. ఉవిద చనుదోయి యొండొంటి నొరయుచుండి
వేర వర్ణింప మితిలేక వృద్ధినందె
నల్లవారిసమొనలతో నడుమఁ దమ్మి
తూడుదారమ్మునకు సందు తోఁపకుండ. 48

తే. గీ. మృదుశిరీష సుమంబుల మించునట్టి
కాంతచేదోయి సందేహకారి యగును
విజితుఁడయ్యెను మదనుండు వృషభవాహు
కంబు గళమున నిడిన పాశంబు లనఁగ. 49

క. స్తనబంధుర మగుకంధర
మునకును ముక్తాకలాపమున కన్యోన్య
మ్మును శోభాజననమ్మునఁ
జనె భూషణభూష్య భావ సంగతి సతమై. 50

తే. గీ. ఇందుబింబంబునం దరవిందగుణము
నందఁగాలేక యరవిందమంది యిందు
గుణమునందఁగ లేక యక్కువలయాక్షి
మోమునం ద్వ్యైశ్రియమహంబు నొందెలక్ష్మి 51

తే. గీ. పుష్ప మొక పల్లవంబునఁ బూనియుంపఁ
బవడమున ముత్యమును జేర్పఁ బాటివచ్చు
రాజబింబాననాధర రాగమిళిత
కుందసుమబృందసితతర మందహాసము. 52

తే. గీ. అమ్మధురవాణి లీలార్థ మమృతధార
లొలుకఁబలుకఁ దొడంగిన నొగిఁబికోక్తి
యింపునొసఁగద శ్రుతికి మోహియింపఁబడిన
విషమతంత్రీయుతంబగు వీణవోలె, 53

తే. గీ. అవిరలానిల మెనసిన తొవలువోలు
చంచలములైనకన్నుల చాకచకులు
లేడిలేమలు నేర్చెనో లీలఁదన్నుఁ
గాంచి తానేర్చెనో లేడి కదుపులఁగని. 54

తే. గీ. ఆయతములైన బొమల నయ్యజుఁడుదిద్దె
నంజనశలాకచేపట్టి యతులితముగ
దానఁగాదె యనంగుఁడాదరముఁగొనియె!
మదిశరాసన సౌందర్యమదము విడిచి. 55

తే. గీ. భావమున సిగ్గు, తిర్య క్ప్రపంచమెందుఁ
బొందదనుమాటలను లేదు సందియంబు
చమరు లంగనకేశపాశంబుఁజూచి
వాలములమీఁది ప్రేమంబు వదలకుంట. 56

వ. మఱియు నయ్యింతి విశ్వసృజుం డేకస్థ సౌందర్య సందర్శన లాలసత్వంబున యత్నంబున సకలోపమాద్రవ్యంబులచే నొనర్చెనోయనఁ బితృగృహంబునఁ బెఱుగుచుండ. 57

ఉ. కామచరుండునారదుఁ డొకానొకనాఁ డలతండ్రియొద్ద నా
హైమవతిం గనుంగొని భవార్థశరీరము నందుఁ బ్రేమచే
నీమురిపెంపుఁగూఁతురని నీరజనాభకృపైకభాజనుం
డామునిలోకపుంగవుఁ డహార్యకులేశున కానతిచ్చినన్;

ఉ. మాన్యుఁడుదేవమౌని గరిమంబునఁ బల్కిన నాటనుండియు
న్గన్యను లబ్ధయౌవనను గాంచియునుండె గురుండు తా నివ్వ

త్త్రాన్యవరాభిలాషుఁడయి యాగమపూత హవిష్యమందఁగా
నన్యములైన తేజములు నర్హములే జ్వలనంబుఁ దక్కఁగన్?

తే. గీ. అద్రినాథుం డయాచిత యగుశివుఁద న
పట్టెఁజేపట్టఁ జేయనోపం డెపుడును
ప్రాజ్ఞుఁ డభ్యర్థనాభంగభయముచేత
నభిమతార్థంబులందు మాధ్యస్థ్యమందు. 60

ఉ. కాయమువీడె యోగ విశిఖాతతిఁ దండ్రియవజ్ఞఁ గూర్పదా
క్షాయణి యెప్పుడంత సుమకాండ వికారమువాని శూలితా
నే యపరిగ్రహుండయి వినీతత ఘోరతపంబు నిష్ఠమైఁ
జేయఁగ శీతశైలమును జేరె గణంబులుదన్నుఁ గొల్వఁగన్.

వ. అట్టులయ్యెడ నయ్యష్టమూర్తి సకలతపోనియ
మంబులకు ఫలవిధాయకుండయ్యు నేదేని కామంబున నిజమూ
ర్త్యంతరంబును సమిత్సమిద్ధంబు నగు జ్వలనంబుఁ బ్రతిష్ఠించి
నిష్ఠాగరిష్ఠుండై తపంబొనరించుచుండ నయ్యద్రినాథుండనర్ఘ్యం
డును బురందరాది బృందారక వంద్యుండునగు నయ్యిందు కలా
ధరు నర్ఘ్యపాద్యాదుల నారాధించి నియతయు వయస్యా సమే
తయునగు తనకూఁతుఁ దత్సేవార్థంబుఁగా నియోగించిన. 62

శా. అత్తారుణ్యవతి స్తపోనియమ చర్యావార్య విఘ్నంబుగ
న్జిత్తాబ్జంబున నెంచియు న్భవుఁడుదర్ఘ సేవింపఁగా నూఁకొనె
న్మొత్తంబొాచు వికార హేతువులు తన్బొందంగ నెవ్వానికి
న్జిత్తంబు త్తలపాటునొంద దతఁడే చింతింప ధీరుండిలన్.

సీ. అరిగి తాన మొనర్చి యరుదెంచునంతలో
వేదిఁ జక్కఁగఁ జేయు విసువుఁ గొనక
పెనుతపంబొనరించి విరమించునంతలోఁ
బూజకై పూవులఁ బూనికోయు
నర్చనంబొనరించి చర్చించునంతలో
నియమవిధ్యర్థమై నీరు దెచ్చు
నియమవిధుల్ దీర్చి దయఁ జూచునంతలో
బర్హిస్తతిం దెచ్చి పదిలపఱచు

తే. గీ. నహరహంబున నయ్యహార్యాధిరాజ
జాత సేవించె నిట్టులభ్యాభతనాధుఁ
డత్సిరశ్చంద్రి శిశిరపా దవిమలప్రి
భాషనోదిత నైజసంతాప యగుచు.

క. అత్తరిఁ దారక దనుజా
యత్తమహావిభవులగుచు నాఖండులుతో
మొత్తమయి వేల్పులెల్లరు
నత్తామరచూలి పాలి కరిగిరి భక్తిన్. 65

శా. సౌవర్ణోరుసహస్రపత్రిమయభాస్వత్పీఠమందు న్వచో
దేవీభావిత వక్త్రతామరసుఁడై దేదీప్యమానౌజుఁడై
దేవర్షిస్తుతి విస్తరంబులకు సంతృప్తాత్ముఁడై మెక్కుడౌ
ఠీవింగొల్వున నున్నయట్టి పరమేష్ఠిం గాంచి రానిర్జరుల్

ఉ. అట్టులు కాంచి యంతట భయంబునుసంభ్రమమున్నె
నంగొనం
గట్టులచట్టుపల్ నలుకు కైదువుపట్టెడిదిట్టఁడాద్యుఁడౌ
నట్టి మరుద్గణంబు లజు నంబుజగర్భునుతించి రెంతయు
నెట్టల నెట్టి నారమని చేతులు మోడ్చియిదం విధంబుగన్
తే. గీ. అభవ భవభయహారణ మహానుభావ
భావనాతీత వీతమాయా వికార
కారణవిహీన నానాజగన్నిదాన
దీనజనభక్తసంతాణ దీక్షితాత్మ. 68

శా. లీలార్థంబు సృజింపఁగా జగమునాళీకాక్షునాభీసరో
నాళీకాంతసముద్భవుండవయి యంతన్గాయబుద్ధీంద్రియా
ద్యాలంబంబుగఁజేసియాత్మఁదగుకార్యంబుల్నియోగించిత
త్కాలంబున్విధియించునీకు నుతులర్థిగావింతుమశ్రాంతమున్

ఉ. పోలుపుగ సర్వసృష్టికినిఁ బూర్వము కేవలరూపకుండవై
సలిలజగర్భ! సత్వగుణ సంపద పెంపున విష్ణుమూర్తివై
చెలఁగి రజస్తమోగుణవిచేష్టల ధాతృమహేశరూపముల్
గలిగి త్రిమూర్తిధారివయి కాంచెడినిన్ను నుతింతుమెప్పుడున్.
తే.గీ. అజ హరి హరస్వరూపంబు లవధరించి
తత్తదాత్మీయదశమహత్వంబుఁజూపి
సర్గరక్షాక్షయంబులఁ జలియుందు
వేకతనుబొంది నీవ కావే మహాత్మ. 71

తే-గీ. పూరుషార్థ ప్రవృత్తిని వైరహించు
ప్రకృతివయ్యు నుదాసీనభావమంది
సాక్షిమాత్రుఁడవౌచు నోజలజగర్భ!
పురుషుఁడనఁదగియుందువీ వరయఁగావె. 72

క. పితరులకుం బిత వా దే
వతలకు దేవతవు నరయఁ బరములకెల్లన్
జతురాననపరుఁడవు ధా
తృతతికిని విధాతవున్ ప్రతిపాద్యా 73

వ. మఱియు నారీపుంసి సృథగ్భిన్న రూపుండవగు నీ దేహభాగంబులె సృష్టికి హేతుభూతములై లోకంబులకుఁ బెతరులునాఁ బఱఁగుచుండు నిజకాలపరిమాణ విభక్తనక్తందివంబులగు భవత్స్వప్నావబోధంబులు సమస్తచరాచరజంతుసంతానంబులకుఁ బ్రళయోదయంబులై నివ్వటిల్లుచుండు నఖండబ్రహ్మాండఖరండంబులకు నిదానుండవయ్యుఁ గారణరహితుండవైయుందువు సంవర్తాంతంబున సకలజగత్సంహార మొనరించియు నిరంతకుండవౌదువు సరి త్సముద్రాదులవలె రసస్వరూపుఁడవయ్యును ధరాధరంబులభంగి గఠినస్వరూపుఁడవయ్యును స్థూలసూక్ష్మ లఘుగురుత్వంబులఁ గార్యకారణరూపుఁడవైయుందువు.సమస్తభూతజాతంబులు నీస్వరూపములు. నిన్ను నామ్నాయప్రపంచమునకు నోంకారరూపుఁడవనియును దదుదాత్తాను దాత్తస్వరితోచ్చారణ పూరకంబుగాఁ జేయం

బడుజ్యోతిష్టోమాది సవనస్వరూపుఁడ వనియుం జెప్పుదురు.
దేవా హోతృహవ్యభోక్తృభోజ్యంబులు శాశ్వతుండవైననీవ నీ
కిదె ప్రణామంబు లాచరించు వారము. 74

క. అనియిట్లు పంకజాసను
వినయంబున వేఁడుకొనెడి వేల్పులనెల్లం
గనుఁగొని యాదరమొప్పఁగ
నను వారలతో ననుగ్రహాభిముఖుండై 75

ఉ. భూరిపరాక్రమ క్రమవిబుద్ధమహాయశులార వేల్పులా
రా రహి మీనియోగముల రంజిలుచుంటిరె మీకుస్వాగతం
బా రిపువీరు లెవ్వరును బాధలొనర్పరుగా యటంచు న
వ్వారి ననేక నేత్రముల భవ్యకృపంగనుగొంచు వెండియుఁన్.

అ-వె. వత్సలార తొల్లి వైఖరి మీయందుఁ
దోచకుండెఁగతముఁ దోచకుండె
హిమమువోడమఁజెడెడి కమలంబులట్లు మీ
మోములెల్లఁ గాంతిలేమిఁ గుందె 77

శా. గర్వాంధామర వైరివీరచయ రక్తస్తోమ సుస్నాతమై
యుర్వీభృత్కుల పత్రమండల భిదోద్యోగాత్తపాండిత్యమై
స్వర్వాసోదయకారియై నెగడునీవజ్రాయుధం బెంకయున్
నిర్వీర్యంబయి వృత్రశాత్రవునిగ్లానిందెల్పె నీనాటికిన్. 78

క. అరివీరదుష్ప్రధర్షము
వరుణునిచే నొప్పు నట్టి పాశంబిటు లు

ద్ధురమంత్రి హతబలంబగు
నరగేంద్రుని దైన్యమొందియుండెం దలఁపఁ. 79

ఆ. వె. భగ్నశాఖమైనపాదపంబునుఁ బోని
యగదమాఁ గుబేరు నలఘుభుజము
శల్యకల్పమైన స్వపరాభవంబును
జెప్పఁ దొడఁగె నాగఁ జిన్నెలూనె. 80

క. దండధరుండుండె మహో
ద్దండంబుగనుండు కాలదండముతోడన్
మెండుగ రాయుచు నేలను
చండిమ లేకుండు పెల్లఁ జాపెడిభంగిన్ 81

వ. అనియివ్విధంబున నవ్వేరించి కరుణారసంబున మించి యప్పురందరాది బృందారక బృదంబులగని వెండియు నిట్లను సకలలోకంబుల సృజించుపని నాయందున్నయది తద్రక్షావిధి మీయధీనమైయున్నయది కాననేమికతంబున నేగుదెంచితిరి. మీకెద్దిప్రియం బది వేడుండని యానతిచ్చిన 82

క. పురుహూతుఁడు నిజగురునిన్
గరము ప్రచోదించు వేయికన్నులునొప్పన్
దరువాత మందమారుత
పరిగత కమలాఢ్య కమలవన సుందరమై 83

తే.గీ. వేయి కన్నుల కన్నను వినుతమైన
యమ్మఘువు రెండుకన్నుల నలరుగన్ను

విన్నవించె బృహస్పతి వెఱవఱియయి
జలజసింహాసనునకు నంజలి ఘటించి 84

తే-గీ. అభవ భవనాశ నీవిప్పుడడిగినట్టి
యర్థ మెఱుఁగంగ లేవె నీవరయ సకల
జీవకోటులయందును జేరియుందు
వైన నొకకొంత వినిపింతు నాలకింపు. 85

క. ఘనతపమునగఁచి నీచే
ననువుగ వరములనుబడసి యమరాంతకుఁడై
దనుజుఁడు తారకుఁ డనువాఁ
డనిశము నెగ్గులనొనర్చు నఖిలజగతికిన్ 86

ఆ. వె. భానిపోలి నినుఁడు వారిజాకరముల
నంబుజములుమాత్ర మధికవికస
నంబునందు నాతపంబమఱఁగఁదత్క్రూ
పావలోకమునకుఁ బాత్రుఁ డగును. 87

తే. గీ. సకలకలలనుఁగూడి యాచంద్రుండు
నెల్లప్పుడు సేవచే దైత్యవల్లభునకుఁ
దుష్టినిచ్చుచునుండు నయ్యష్టమూర్తి
మూర్తినెలకొన్న కలఁగొనఁబోఁడు కాని. 88

తే-గీ. అసురపూఁదోఁటలో గుచ్ఛవిసరములను
నీడి పూవులు రాలుర్న భీతితోడఁ

దత్సమక్షంబునంగాలి తాలవృంత
వాతమున కెక్కుడై పీవ భీతినందు. 89

తే-గీ. ఆరుఋతువులుఁగూడి దేవారినెపుడు
ఋష్పసంభారతాత్పర్యమునఁ ద్యజించి
క్రమము నుద్యానపాలక క్రియమునంది
భక్తినెంతురు వినతులై ఫ్రీతిదినమ్ము. 90

క. రత్నాకరుఁడెప్పుడు నా
రత్నముల నుపాయనముగ రాత్రించరునకున్
యత్నంబున నిచ్చుటకై
నూత్నంబుల వెదకుచుండు నుత్తభవభయా 91

క. రక్కసిచుక్కలరాయని
నుక్కర భుజగాధి పతులు నుజ్వలమణులన్
బెక్కులు దీపంబులుగా
నెక్కొని సేవించుచుందు్రి నిశలంబెపుడున్ 92

ఆ-వె. పాకశాసనుం డనేకకల్పదుృిమ
భూషణావళులనుఁబుచ్చి యసుర
దయనొకింతఁగాంచి తదనుకూలత్వంబు
నెనయఁ గోరుచుండు ననవరతము. 93

క. నందనవనమున దివిష
త్సుందరు లెడఁగడలుకొనఁగఁ దోరఁపుఁగ్రపకో

యందగు చివురులుగల హారి
చందన ముఖ భూజములనుఁ జలమున నఱకున్.

క. బందీకృత సురనారీ
సందోహంబెపుడు వీచుఁజామరములచేఁ
గందోయినుండి వెడలెడి
బిందువులోనగూడు శ్వాసవిధపవనములన్. 95

తే. గీ. యజ్వ లెప్పుడు మాకంచు యాగములను
హవ్యముల నాహుతులొనర్ప నగ్నియందు
నజుఁడ! కాంచెడివన్నిఁనానాదరించి
యపహరించును వాఁడు మాయావియగుచు. 96

తే. గీ. మూర్తిఁగొన్నట్టి దేవేంద్రుకీర్తియనఁగ
నలరు నుచ్చైశ్శ్రవ సమను హయవరంబు
నధికబలదర్పితుండగు యాతుధాన
వరుఁడు హరియించె సురలెల్ల రఱయుచుండ. 97

ఆ. వె. అఖిలగుణములందు నైరావతము మించు
నసురవరుని గజము లవధరించె
నమరనాథ! పుష్కలావర్తకాదుల
యందు వపరికేళి ననుదినంబు. 98

తే. గీ. క్రూరుఁడగు వానియందే మనోరథం బొ
నర్చు యుక్తులు వీర్యవంతంబులైన

మందు లాసన్నిపాతంబునందుఁబోలె
విఫలతనుబొందె నో శ్రుతివిదిత విభవ. 99

తే-గీ జయ మొసఁగి కూర్చుముదము నిర్జరుల కెప్పు
డట్టి వైష్ణవ మైన చక్రాయుధంబు
నసురవరకంధరార్పిత హాటకోరు
నిష్క-మట్టులు భాసిల్లె నిష్క-ళంక. 100

ఆ-వే. కాన దేవ! వానిగర్వంబుచెడఁగ సే
నాని నొకనిఁ గోరి రీనిలింపు
లమ్ముముక్షువుల్ భవాబ్ధి పారముఁజేరఁ
గర్మబంధమడఁచు ధర్మ మట్లు. 101

ఆ-వె. అమరసైన్యములకు నరయనబ్బలవంతు
ముందు నడపుచుం బురందరుండు
శత్రులందినట్టి జయలక్ష్మి నెప్పటి
యట్టులాహరించు నబ్జగర్భ. 102

క. అని యిట్లుపలుకఁగా న
య్యనిమిషగురుఁ డాలకించియంభోజభవుం
డనియెనిటులెల్లవేల్పులఁ
గని యభినవమేఘమంద్రిగర్జారభటిన్. 103

తే-గీ. దివ్యవరులార! కోర్కి-సిద్ధింపఁగల దొ
కింతచేయుఁడు కాల నిరీక్షణంబుఁ

గాని తత్కార్యసిద్ధికిఁ గారణంబు
కాదు నాదగు భూతసర్గక్రమంబు. 104

వ. మదనుగ్రహ సంప్రాప్తవైభవుండగు నన్నిశాచరుండు తనచేఁ బెనుపంబడినవిషవృక్షంబయ్యును దాన ఛేదించుట కర్హంబుకానిభంగి మత్కృత నాశంబునకుండఁగఁడు. మొదటనత్తారకుండవధ్యత్వంబు మాత్రమర్థించె. నదియును సకల జగమ్ములనొక్కమ్మడిఁ గాల్పనగు దత్తపో నలం బుపశమింపఁ జేయ మదంగీకృతంబయ్యె. నీలలోహితనిజాంశంబునకుఁ దక్క నారక్కసి చుక్కలరాయని లెక్కచేయక మొనకెక్కి విక్రమింపఁ జాలినవాఁడెందు నసాధ్యుండు. తదీశాంశంబునకుమాత్రమ ట్టిపరాక్రమం బెట్లంటిరేని తమోగుణాతీతుండై మాయం బడక తేజోమయుండైయుండు సవ్వామదేవుఁ దెలియ నాకు నవ్వాసుదేవునకు నసాధ్యంబు. మీరు కార్యార్థపరులైతిరేని యుమారూపంబున నాహరు నయస్కాంతమణిచేత లోహంబునట్లు లాకర్షింప నుద్యుక్తులుకండని వెండియు.

తే. గీ. శంకరాత్మోపహతశత్రు లింకమీరు
వితత నిజరాజ్యమును బొంది యుబెరులెవరుఁ
దేరిచూడంగరాక మోధీరులార
కలుములనుఁగాంతు రింత నిక్కమ్ముసుమ్ము. 106

తే. గీ. అనియిటులు దానవారుల కభయమిచ్చి
ధాత యంత వెసం దిరోధానమందె

సమరవర్యులు నగుఁగాక యనుచుఁబ్రీతి
దివమునకుఁ బోయిరంత ను దీర్ణగతిని. 107

ఆ. వె. పాకశాసనుండుఁ బంచసాయకుఁబొందెఁ
గార్యసిద్ధికంటెఁ గమనవేగ
మెనయుమనసుతోడ నీతండ యభవుని
నిలిచి గెలుచునంచు నిశ్చయించి. 108

శా. పూవిల్కాఁడు వెసన్మనోహర రతిభ్రూవల్లికాచారుశృం
గావాసంబగు విల్లుఁ గంఠమున భార్యా కంకణాంకమ్మునః
శ్రీవిస్ఫూర్తిఁదవిల్చి మిత్రకర సందీప్తాత్మ చూతాస్త్రిఁడై
దేవేశానునిఁ గొల్వవచ్చె నతిభక్తిన్ బ్రాంజలిప్రాప్తుఁడై.

తే. గీ. ఇంద్రు చూడ్కులు వేయియు నెల్లసురల
వీడి యొకసారి వ్రాలె నవ్వీరుమీఁద
గార్యసాపేక్షుఁనగు ప్రభు గౌరవంబు
స్వాశ్రయులయందు నెపుడనై కాంతికంబు. 110

ఆ. వె. పంచసాయకుండు వాసవాసనమున
కంతికంబునందు సంతసమునఁ
గూరుచుండి భర్తృగురత్వనుగ్రహమునుఁ
దలఁచి యిట్టులనుచుఁ బలికెనంత. 111

శా. విజ్ఞాతాఖిలపుం విశేషవిభవా! విశ్వంబునందెల్ల నీ
యాజ్ఞన్ జేయనివారలుంగలరె నీయర్థంబు కర్తవ్యమో
యాజ్ఞాపించిన నీక్షణంబున నె చేయంజాలు దో దేవ నా

ప్రాజ్ఞత్వంబున నంచు నెంచియుననుం బంచేషుఁ డయ్యెంద్రుతోన్

క. మదిఁదలఁప నీవు నామదిఁ
గదిరెను సంతోషమిపుడు కడిఁదియ నజ్ఞన్
దిరిది వేశనాకునిడి యా
ముదమునిపుఁడు కరుణ వృద్ధిఁబొందింపు మొగిన్.

శా. స్వారాజ్యంబునఁగోర్కె నెవ్వఁడయిననన్వర్గేశ మర్త్యుండునీ
భూరిక్రోధము నెంచకే ఘనతపంబుల్జేయుచున్నన్ స్ఫుర
న్నారాచాహితమైన సాధనువుతో సమరిత్వమందన్ మహో
దారత్వంబునఁ జేతునంచు మఱియున్ ధైర్యంబుఁ బెంపారఁగన్

ఉ. జన్మజరామృతుల్ భవవశమ్మునఁ గల్గునటంచు నెవ్వఁడే
నిన్మనుజుండు మోక్షమును నిండుమదింగన నెంచెనేని వా
నిన్మరుదీశ! బాలహరిణీనయనాజనతాకటాక్షపా
శిన్మదమార బద్ధుఁడయిలీసుఁడు గాఁగనొనర్తుఁ బెంపునన్. 115

మ. ఉశనోఽధ్యాపితనీతిశాస్త్రిఁడగు నేయుద్దామశత్రుండనీ
దృశనీతిప్రబలున్ నిన్ను జెనకి వేధింపన్మదింబూనె నా
దశసిద్ధించినఁ జెప్పు మోఘము ప్రవృద్ధంబై తటంబుల్బలెన్.
గృశియింపంగ నొనర్తు భూరిభుజశక్తిన్ మానుమాశంకలన్.

తే. గీ. చెలువుచే నీమదింగొన్న చెలువయెవతె
చెలువునందలి వ్రతమునఁ జేరరాదొ
చెప్పుమదియు స్వయంగ్రహాశ్లేషమునకుఁ
జేతులను జాచుకొనిరాగఁ జేతునేను. 117

ఉ. కాముక కోపశీలయగు గామినికీ వెఱగంగఁబోయి యు
ద్ధామతదీయ పద్ధతికిఁ దార్కొని తేర్పఁగలేకపోతివా
భామయు భూరితాపమునఁబాల్పడి పూవులసెజ్జదిక్కుగాఁ
బ్రేమతలిర్ప నీకయిపొరింబొరి దుఃఖమునందఁ జేసెదన్.

ఉ. వీర మదీయ శాతశరవృష్టి సమీక్షణ యోగ్యులైన దే
వారులు కల్గిరేని కులిశాయుధ మీవును మారకుండుఁడ
వ్వారల నిప్పు డేనుచని వైరముమానిచియాచరింతుగో
పారుణితాక్షులై నెగడునాంద్రనుగాంచియు భీతినందఁగన్.

ఉ. నీదుమహాప్రసాదమున నెచ్చెలియొక్కఁడుతోడు కాగ నే
నోదివిజేశ పుష్పధనువుద్ధతినెత్తి పినాకమెత్తి స
మ్మోదమునన్ రణంబునకుఁ బూనిహరుండరుదెంచెనేని యు
న్మాదముఁ గూర్పనేర్తునని నంబెరవారలు నాకులెక్కయే.

వ. అనియివ్విధంబున నక్కందర్పుఁడు దర్పమెలర్పఁ బలుక నప్పలుకులాకర్ణించి పాకశాసనుండు నిజోరుకీలితంబగు చరణతలంబును తదరుణనఖరకాంతిజాలంబు జాంబూనదపాదపీఠంబునకుఁ గొ్రొత్తసొంపు సంపాదింపనునిచి పురహారణచిత్త హారణ ప్రవీణతానిధానుఁడగు నమ్మాననకేతను నవలోకించి ప్రకటితస్వసామర్థ్యుండగు వానితో నిట్లనియె. 121

తే. గీ. నీదుసారము నెఱిఁగియేగాదె యిప్పు
డిట్టిపనిని నియోగించుచేను నిన్నుఁ
బుడమిఁ దాలుచు శక్తిని బొడఁగనిగద

తన్ను ధరియింప భుజగేంద్రుఁ దార్చెహరియు. 122

క. నీవిప్పుడేగి యాహరుఁ
జేవచెడఁగ నమ్మలేసి చీకాకుపడం
గా వలయుఁజేయ నింతియ
భావంబుల వేల్పులరయు పరమప్రియమున్. 123

తే. గీ. వినుము కమలాసనుఁడు సెప్పె వీరవర్య
భవభవుని సైన్యపతిఁజేసి పగరఁగెల్వ
డంచు బ్రహ్మాంగభవుఁడు బ్రహ్మనుయోజి
తాత్ముఁడాతఁడు సాధ్యుఁడే యందఱకును. 124

ఉ. శాంభవమైన తేజమును శైలకులాధిప పుత్రిఁదక్క ని
ర్దంభమున న్వహింప నితరల్ సతులెందు నశక్తలంచు న
ప్పంభవసంభవుండు మునుబల్కెనుగానదపోయ తాత్ముఁడౌ
శంభుని నీవభీప్సితుని సల్పఁగఁ జెల్లు నహార్యకన్యపై. 125

చ. జనకుననుజ్ఞ నయ్యచలసానుతలంబుననున్న శంభుఁ గై
కొని యచలాధిరాజసుత కొల్చుచునున్నదటంచునప్సరో
వనితలుచెప్పవింటి నిటువంటి వెఱింగి మొరుంగఁజెప్పఁ నా
కనువగుగూఢచారులన నంగజ వారుగదా తలంపఁగన్.

తే. గీ. కానఁనీవేగుమిఁక సురకార్యసిద్ధి
కొఱకు ననితరసాధ్యమౌ గోరెడుపని
పృథుల హేతువవగుని న్నపేక్షసేసె
పుట్టుటకుముందు మొలకయంబువులఁబోలె. 127

తే. గీ. అమర విజయాభ్యుపాయుఁడై నట్టి హరుని
యందు శరగతినీయదియ కృతిప్రీవ
తక్కువైన ననన్య సాధారణ మగు
కృత్యమేకదనరులకుఁ గీర్తిఁదెచ్చు.

ఉ. వేలుపులట్టియర్థులు త్రివిష్టపసమ్మతమట్టికార్య మ
య్యాలము నీదుచాపమున నౌనటె కాదటె హింస్రమర్థు రే
మేలగునీదు భాగ్యమును మీనజయాంక నుతింప నేరికిం
బోలునె భూరివిక్రమ విభూతియుతుండవునీవ యెంచఁగన్.

తే. గీ. మదన! నీకుసహాయుఁడై మాధవుం డ
నుక్తుఁడయ్యును వచ్చుట యొప్పుగాదె
పిలచి చెప్పంగ వలెనేమి పేరకుండ
వనలునకునీవు కమ్మని యనిలు నెందు. 130

తే. గీ. అనిపలుకునాకవిభునాన నంగజుండు
శేషమాదిరిసాదలఁ జేర్చి వెడలె
నప్పు డైరావతాస్ఫాలనాతికర్క
శాత్మకరమునఁ దనదు మేనతఁడు నిముర

వ. అట్టులమ్మన్మథుండు మాధవసనాథుండై రతికరకన
క వలయాంక బంధురంబగు కంధరంబునఁ జంచరీకశింజినీ మండి
తంబగుఁ గోదండంబునుదాల్చి మేనికపోయినను బూనికఁదీర్తున
ను నిశ్చయంబున హిమ త్ప్రదేశంబుననున్న శాంభవాశ్రమాంతి

కంబునకుఁ జని సమాధివన్ని రోధకుండును నిజమానసాభిమాన భూతుండునగు నమ్మాన్మథవువిజృంభింపఁగాని మోగించెననుటయు

మ. సతతాంతేవస దర్థబోధనిపుణా సత్యంభవిష్ణుప్రతి
జ్ఞ తతాచ్ఛస్వ యశస్సమంచిత దిశాకాశాంతరా శాంత రా
జితదేహా సితదేహా దివ్యపద రాజీవద్వయీపార్శ్వనా
సుతరామాదరయుక్తమానస మనశ్శోభాయుతప్రక్రియా.

క. సరసాగ్రేసర సాదర
పరితోషిత సిత మనః ప్రవర వరధీ సుం
దర దరహాసాంచితవద
న రజనియువతీశబింబ నయనయనాఢ్యా. 134

మాలిని. అనవరతసుకావ్యవ్యాప్త శుద్ధాంతరంగా
ఘన విమలదయాసిక్త క్షురద్బృక్తరంగా
దినదిన కృతపూజాధిక్యసంతుష్టరంగా
మనసిజజనకాధ్యోన్మత్తచేత స్తురంగా. 135

గద్యము:—ఇదిశ్రీమద్బాలాత్రిపురసుందరీప్రసాదాసాదితాన
వద్య కవితా యోగహృద్య భారద్వాజ గోత్రపవిత్ర మహి
తాపస్తంబసూత్ర లక్ష్మీనారాయణ యజ్వపుత్రగురుజనా
శీర్వచనపాత్ర విజ్ఞజన విధేయయజ్ఞనారాయణ నామ
ధేయ ప్రణీతంబగు కుమారవిజయప్రబంధంబునఁ
బ్రథమాశ్వాసము

---

# కుమారవిజయము.

## ద్వితీయాశ్వాసము



క. శ్రీ మంగమాంబికాధవ
ధీమజ్జనగణవరేణ్య ధృతపరమగుణ
స్తోమ కొమాండూర్వేంకట
రామానుజ నామధేయ ప్రాజ్ఞవిధేయా 1

వ. ఆకర్ణింపుము. 2

తే. గీ. పరమ యమియమ విఘ్న సంపాదకుఁడయి
యుద్యదాత్మాను భావుఁడై యొప్పెనపుడు
పుష్పబాణున కభిమానభూతుఁడైన
మాధవుం డభినవ వనమాధవుండు 3

శా. సమయోల్లంఘనమాచరించియుదగాశన్ దత్కుబేరప్రియ
న్గమలాప్తుండనుకూలుఁడై జెనయ వేడ్కంబోవనాదక్షిణా
శ ముఖప్రాంతమునుండి గంధవహముత్సర్జించెఁదద్దుఃఖసం
భ్రమసంపాదిత దీర్ఘ కోష్ణనిజనిశ్వాస ప్రసంగంబునన్ 4

సీ. కామినీస్పర్శ నా కాంక్షింపకయ పూఁచె
గుచ్ఛంబులం బ్రియంగుద్రుమంబు
మోషాలలామ గండూషాసనము మాని
వకుళంబు పూలచే వరలె మిగుల

బాల నూపురరణ త్పాదాహతింగోర
కయ్యశోకము సుమవ్యాప్తమయ్యె
కాంతాధవళహాస మింత లేకయు పుష్ప
సంభారముంబూనెఁ జంపకంబు

తే. గీ. నర్మవాక్యంబు లేక మందారశాఖ
తిలకభూజంబు కోమల దృష్టి లేక
వివిధ పుష్పఫలంబుల నవధరించె
మానితంబగు మాధవు మహిమవలన 5

మ. కిసలాంకూర విచిత్రపత్రచయ సంకీర్ణంబులౌ చూతబా
ణసమూహంబులు నిర్మితంబులయిన న్నామాక్షరంబుల్ లిఖిం
ప సకాలంబని కంతు నామమునఁ దద్వర్ణంబులన్ వ్రాసెఁబో
రసికుండైన మధుండునాగ మధుపవ్రాతంబు చేరెన్వెసన్ 6

తే. గీ. కర్ణికారంబు వర్ణప్రకర్ష కలిఁగి
యును వృథంగూర్చె నెత్తావి నెనయకుంట
మహిఁ దరుదగ గొనంపుసామగ్ర్యవిధికి
బ్రహ్మ నైజప్రవృత్తి పరాఙ్ముఖగద. 7

ఉ. బాలశశాంకలేఖలన బాగున మీరిన రాగవత్పలా
శాళిమనోహరంబగుచు నామనియన్విటుఁ డుల్లసద్వసీ
బాలల నేర్పుమై నఖరపాళిక్షతంబులొనర్చెనాగ ను
న్మీలితమై కడుంగడు నమేయగుణంబునఁ బ్రొల్చెనత్తరిన్.

తే. గీ. తేఁటి కాటుకపూతలఁ దేటమీఱు
నట్టి తిలకంబు మోమునఁ బెట్టి బాల
భాస్కరారుణ్యమునఁ బల్లవాధరమును
జాలఁ దళ్కొందఁ జేసె వసంతలక్ష్మి.        9

ఉ. మెత్తనిమావికెంజిగురు మేకొని తాభుజియించి మించి యు
న్మత్తత నుల్లసద్వకుళ మంజుళశాఖ వశించి కూసె న
వ్యుత్తమభంగిఁ గోయిల కుహూయని దర్పకుఁడవ్వియోగినీ
చిత్తగతాభిమానము నశింప నొసంగిన యానఁజాటెనా

సీ. రాజీవరాజీ విరాజమాన సరోవ
రాజవాహనరాజ కూజితంబు
మందారమకరంద తుందిలేందిందిరా
వారసుందరమంథ రారవంబు
లోలబాలరసాల సాలపల్లవలోల
కలకంఠకలకంఠికా రుతంబు
నానావిధానూన సూనసంచయ పరీ
మళమిళన్మృదుగళ న్మారుతంబు

తే. గీ. లలితపరిపక్వబింబఫల రసపాన
మత్తచిత్తజహాయసత్తమ కలకలము
నొక్కసారిగఁ జరియింప నోపలేక
మూర్ఛనందిరి పాంథులు పొడవుపీడి.        11

వ. అయ్యవసరంబున నిందుకళావతంసాశ్రియవాసులగు

మునిబృందారకులందఱు సయ్యాకాలికంబగు వసంతాగమనంబు
నిరీక్షించి కథంచి న్నియమితమనస్కులై యుండి రయ్యెడ. 12

సీ. తేటిఁ బోటిని గూడి తేనెలంగ్రోలఁగ
గుచ్చపాత్రింబులం గోరివాలె
శృంగాగ్రములచేఁ గురంగిం గురంగంబు
కండూయన మొనర్చెఁ గరము ప్రీతి
తుండంబునం బీల్చిగండూష జలము వే
దండంబున కొసంగెఁ దాకరేణు
వర్ధోపభుక్తంబు నాదరంబున నిచ్చె
బిసము జాయకుఁ గూర్మిపేర్మి నంచ

తే. గీ. భూరిసీతాంతర శ్రిమవారిలేశ
కించిదుచ్ఛ్వాసి పత్త్రిరేఖాంచితంబుఁ
గిన్నరీవక్త్రపద్మంబుఁ గిన్నరుండు
బాగు బాగంచు మించి చుంబనమొనర్చె 13

తే. గీ. వితతసుమమంజరీ కుచానతలు నుల్ల
సత్ప్రవాళోష్ఠలగు లతాసతులవలన
నైజ శాఖాభుజాబంధనముల నంది
తనరె నవ్వేళ నఖిలపాదప సమితియు. 14

తే. గీ. అచ్చరలగీతి వీనులఁ జొచ్చుచున్న
హరుఁడు చెలఁగెఁ బ్రసంఖ్యానపరత నోలి

యొందు నేవిఘ్నములకు నాత్మేశ్వరుల స
మాధిభేదంబొనర్ప శక్యంబుగాదు. 15

తే. గీ. భవునియాన లతాగృహద్వారమందు
నిలిచి వామకరార్పిత:లలితవేత్రుఁ
డగుచు నాస్యార్పితైకాంగుళి గణములను
జాపలమొనర్పకుండంగ సలిపె నంది. 16

క. అచలత్సకలాగంబును
విచలన బంభరము మూకవిగణము శాంతి
ప్రచురమృగ గమనమై వన
ము చెలంగెఁదదాజ్ఞఁ జిత్రమున వ్రాసెననన్. 17

తే. గీ. యానమందుఁ బురశ్శుక్రినట్లు మరుఁడు
భవుని దృష్టిప్రపాతంబుఁ బరిహరించి
యంతటను నల్లియున్న ఛాయాద్రుశాఖ
లొప్పుఁ దధ్యానవేదిక నొదిఁగెఁ బిఱుఁద. 18

సీ. జడలెల్ల సర్పరాజములతో బిగియించి
ద్విగుణాక్షసూత్రంబు వీనున నిడి
కంఠరుచింగూడి క్రాలెడి మృగచర్మ
మును జన్నిదముతోడ నొనరఁదాల్చి
బ్రహ్మకపాలాంత రప్రాప్తమార్గము
లైన చిన్నివెలుంగు లలరఁ గూర్చి

యస్పందపక్ష్మంబులైన కన్నుల యధ
స్తాత్కాంతి నాసలక్ష్యముగఁ జేసి
తే. గీ. యంతరనిల నిరోధంబు నాచరించి
వానసందడిలేని యవ్వారిదము న
నుత్తరంగంబునౌ చెర్వు నుడిగినట్టి
గాలిఁగదలని దీపంబుఁ బోలువాని. 19

శా. ధ్యానంబందు నొగిన్మనంబును నవద్వారుద్ధసంచారము
గా నిర్మించి వశంబొనర్చి హృదయాఖ్యస్థానముం జేర్చి మే
ల్వానిన్మానులెఱింగి యక్షరునిఁగా భావింతు రాతన్నెదన్
దానే గాంచుచునున్నయట్టి పరమధ్యానైకనిష్ఠున్ హరున్.

వ. కాంచి మేను కంపంబునంద వివశుండై భయవశం
బునఁ గరంబున నున్న కార్ముకంబు తొలంగిన తెలంగెలుంగ
కుండనున్న సమయంబున. 21

తే. గీ. అట్లు నిర్వాణభూయిష్ఠమైన తనదు
వీర్యము వపుర్గుణంబున వృద్ధిఁబొందు
నట్లు లొనర్చుచునున్నది యనఁదగి వన
దేవతలతోడఁగూడి సేతెంచుదాని. 22

క. తగుపదమెఱిఁగిన మరుఁడు మె
ఱుఁగువింటి మఱొందునారి రుచిరతనిడె నాఁ
దగి కటి నడుగడుగున జా
రుగుసుమదామమునుఁ గేల లోగొనుదానిన్.

సీ. లలితోదయార్కమం డలరాగమగు పైడి
చేలంబునుంబూని చెలఁగుదాని
వితతేభకుంభద్వయ తులితకుచయుగా
వర్జితనిజతనూ వల్లిదాని
పర్యాప్తపుష్పస్తబక వినమ్రి చరద్వ్రి
తతి మతల్లియనంగఁ దగినదాని
ప్రసవసాయకవధూ ప్రబలరూపమదాప
నోదనిర్మితియన్న వాదుదాని.
తే. గీ. సరళపరిమళమిళిత నిశ్వాసవృద్ధ
తృష్ణ బింబఫలాధరాంతిక చరిష్ణు
చంచరీకంబు సంభ్రమచపలదృష్టి
యగుచుఁ బదపదమందు లీలారవింద
మున నివారించు గౌరిఁ గన్గొనియె మరుఁడు. 24

మ. కని యయ్యంగన నంగసంభవుఁడు నంగంబింతపొంగంగని
వ్వనితారత్నము కార్యసాధనకు నన్వాదేశమై సంభవిం
చెనుశూలాయుధచిత్తకర్షణమునన్ శీఘ్రంబుగాసత్ఫలం
బనుకూలించు నటంచునెంచెను పునర్యత్నంబుసాగింపఁగన్.
శా. అంతర్యాగమునందు గాంచి పరమాత్మాభిఖ్యముందేజమున్
శాంతాంతః కరణుండు నొచుఁ దపము న్నాలించి యుండంగ న
కాంతారత్నము భావిభర్తయగు గంగాధారి ద్వారంగణ
ప్రాంతంబున్ జొరఁబారి నిల్చుటయు భవ్యప్రేమమోగంబునన్

ఆ-వె. నందికేశ్వరుండు నిందుకలాధరుఁ
జేరి మ్రొక్కి యగజసేవకొఱకు
వచ్చెననుచు వినిచి భవుని కనుసన్న న
య్యువిదకుం బ్రవేశ మొసఁగుటయును. 27

వ. అప్పుడు పార్వతి లోనికింబ్రవేశించినంత యోగం
బువలన నుపరతుండై శాంతాత్ముఁడైయున్న నమ్మహాత్ముఁ
జేరంబోయి తనచెలులు తత్పదాంభోజపరిసరంబునఁ గిసలయ
ఖండమిశ్రింబైన గుసుమోచ్చయంబుఁ బ్రణిపాత పూర్వకం
బుగా సమర్పించి నిలచిరంత. 28

ఉ. మానితలీల నల్లనఁ గుమారి కుమారసమీర చాలితా
నూనవినీలకుంతల మనోహర కైరవలోలుపాళినీ
స్వానవచో నుషంగతిని వందనముంబొనరించె ముగ్ధ యీ
శానునిపాదపద్మములసన్నిధి నొదలవంచి భక్తితోఁ. 29

క. త్రిపురాంతకుండు నామెను
గృపతోడ ననన్యసులభుఁ గేల్గొనుమనుచుఁ
గపటేతరముగ పల్కెను
విపరీతార్థములె తలఁప విజ్ఞ వచనముల్. 30

వ. అనంగుండు నయ్యెడ వహ్నిముఖంబునఁ బడఁ
బోవు పతంగంబుభంగి నుమాసమక్షంబున నిటలాక్షుబద్ధ
లక్ష్యుండై పువ్వులవింటికేలివ గమ్ముమను తుమ్మెదనారి
నెమ్మిమైఁ దుడువఁదొడఁగె. 31

తే. గీ. సుదతి భాసవ భానుసంశోషితహరి
భిన్న మందాకినీపద్మబీజమాల
నరుణకిరణాళిచే నొప్పునట్టి కరము
చేత నందించుటయు నంత శివుఁడు కడఁగి. 32

ఉ. ఆహరిణాక్షియిచ్చు నవహాటకపుష్కరబీజదామముం
స్నేహమునంగ్రహించుతఱి జిత్తజుఁడున్సమయంబటంచుస
మ్మోహననామకంబగు నమోఘశరంబుశరాసనంబునం
దాహితముంబొనర్చి నయనాయుధునాయెడసూటిసేయుచుం.

తే. గీ. విధుఁడు తోతెంచువేళ నంబుధియు వోలెఁ
గొంత ధైర్యంబుచెడ నంతకాంతకుండు
నడరఁజేసెను బింబఫలాధరోష్ఠ
మయిన నుమయాననంబున నయనములను. 34

క. శైలాధిపపుత్రి లస
ద్బాలకదంబములఁ బోలు సర్వాంగంబులచే
నాలక్షితయై నిలబడె
నాలో సాచీకృతాననాంబుజ యగుచుం. 35

తే గీ. అంతఁదిగకంటిదొర యింద్రియముల కలక
నియతిమెయి నెట్టెటులో పూని నిగ్రహించి
యెడఁద వికృతినిఁబొందఁగా హేతువెద్ది
యనుచు నలుదిక్కులంజూపు లడరసేసి. 36

మ. అటఁగాంచె న్నిటలాక్షుఁడాక్షణమ సవ్యాపాంగదేశంగత
స్ఫుటముష్టి స్నతవామపాదు నమితాంసుం జారుచక్రీకృతో
ద్భటపుష్పంధయ శింజినీకసుమకోదండుం బ్రహారింప ను
త్కటవృత్తిం దరివేచువాని స్వభువుంగాతర్యదర్పాన్వితున్.

వ. కాంచినంత నిజతపశ్చర్యావస్కంద వివృద్ధరోష భీషణభ్రూభంగదుష్ప్రేక్ష్యుండగు దన్నాగభూషణు విశేష లోచనంబువలన బ్రజ్వలజ్జ్వాలాజాలంబగు జ్వలనంబతర్కితంబుగా నావిర్భవించిన. 39

స్ర. కోపంబుజ్జంపవయ్యా గురుకృపననివాగ్గుంభనంబొప్పనాస్వ
ర్భూపాళుల్ మ్రొయుమ్రోతల్ పొరిపొరిదివికి న్బూర్తిగారాకమున్నే
కోపోదగ్రాగ్రజాగ్రద్ఘుసృణవిషమదృ క్కోటికాటన్మహాగ్ని
క్షేపక్షారావశిష్టాఖిల కరణుఁడునై క్రిందఁగూలెన్మరుండున్,

తే. గీ. కరణవృత్తి నిరోధింపఁ గడగునట్టి
మూర్ఛనొక్క ముహూర్తము మున్గియుండి
పతిగతి నెఱుంగకుంట నా రతి కృతోప
కార యననయ్యె నప్పటి కాలమునకు. 40

ఆ. వె. ద్రుమము నశనియట్లు త్రుంచి కాము హరుండు
నింతివలనఁ గాదె యింతవుట్టె
ననుచు దానివీడి యాక్షణంబందె యం
తర్ధినందె భూతతతియుఁ దాను. 41

తే. గీ. పెద్దతలగల తండ్రి యభీష్టమట్టు
లాత్మలాలిత్యమును వ్యర్థమనుచు దలఁచి
చెలులసన్నిధి యని పెద్దసిగ్గువోడమ
శూన్యమై యుంటికేగఁగాఁ జొచ్చె నగజ, 42

మ. భవసంరంభనిమీలితాక్షి ననుకంప్యన్గూతు నయ్యద్రి లో
కవిభుండంతట వేగవిస్తృత నిజాంగవ్రాతుఁడై దోర్యుగ
వ్యవధానంబునఁగుర్చిచ్చి యెత్తికొని గేహాధ్వంబునంబోయెదం
తవిరాజ న్నవపద్మినీక సురవేదండంబు డంబొప్పఁగాఁ. 43

తే-గీ. అంత మోహాపకాయణ ననశఁ గాము
రామను విబోధితంజేసె నామెయు విధి
యధికదుస్సహవేదన మభినవంబు
నైన వైధవ్యదుఃఖంబు నారగూర్ప 44

క. ప్రిలయాంతోన్మిషితముల న
బల తనకన్నుల వధానపరము లొనర్చెఁ
నలినాక్షి యెఱుఁగ దకటా
విలుప్త సందర్శనుఁడగు విభుని విధంబుఁ. 45

క. జీవమును దాల్చియుంటివె
జీవితనాయకయటంచుఁ జేరుచు నెదురన్
భావిని గనెఁ బురుషాకృతిఁ
గేవలమగు నుగ్రకోప కేలివిభూతిఁ. 46

క. వనిత పునర్వివాహవ్రతం
గని వసుధాలింగనావగాఢ స్తనియై
ఘన కైశ్యము చిక్కుపడం
గ నవని సమదుఃఖకాఁగ గడువిలపించెన్ 47

ఉ. కామ! సుమంబుపోలు ననఁగాఁదగు నీదగుమేనిసొంపు నే
నీమముతోడఁ జేతురు మనీషులు నామ్యముగా విలాసి కా
యీమహితాంగమిట్టిదశ నేదఁగఁ గాంచియునుంటి నిట్టులే
మోమదనా విలాసినుల మోమయమానసలన్నఁ జెల్లదే

తే-గీ. జీవితేశ్వర త్వదధీన జీవిత నను
నలిన నాభుగ్న సేతు సన్నాహమైన
వారిసంఘాతముంబోలెఁ బాసి భిన్న
సౌహృదుఁడవౌచు నెచటికి సాగెదకట 49

ఉ. నాకొకయెగ్గునెన్నఁడు నొనర్పవు నీకదిచేయఁజూడ నే
నా కలనైనసూనశర యంతరమందడలుప్పతిల్లగా
నీకయి యిట్టులున్ననను నిర్ఘృణవీడి చనంగఁ బాడియే
కాక గతంబదేమి కనఁగాఁ దరిజేరవు దీనురాలికిన్ 50

తే-గీ. పేరుమార్పుల నెడఁద భావించినావొ
భావభవ! మేఖలాగుణ బంధనంబుఁ
దలఁచుచుంటివొ కర్ణావతంసకుముద
తాడనంబులఁ దలఁచితో తప్పుగాఁగ 51

తే-గీ. ఎదవసింతువు నీవని మదనునన్నుఁ
బ్రీతినెప్పుడు పల్కుటకైతవమ్మ
యకట నీయంగ ముడివోవ నక్షతయగు
రతికి నుపచారపద మసరాదె దాని 52

తే-గీ. కాంత త్వద్గతి కేనంత చింతసేయ
నేను నీవేగుతోత్రిపతో నేగుదెంతు
విధి జనమ్ముల వంచించె విశ్వసుఖము
భవదధీనంబుకాదె సంభవుల కెందు 53

తే-గీ. ఘూర్ణమానారుణాక్షుల కూర్మిఁగొసరి
పదపదంబున వాగ్గతి ప్రస్ఖలనము
గూర్చు నాసవరసము నిర్గోలుపోయి
నట్టి ప్రమదలయందు నెట్లుందగించు 54

తే-గీ. కూర్మి నెచ్చెలివైన నీకోమలాంగ
ములఁ గధీకృతములనుగాఁదలఁచి విధుఁడు
గతబహుళపక్షుఁడయ్యుఁ బోకార్చె నాత్మ
తనుత నెట్టెటో విఫలుఁడ నని విసువుచు 55

క. హరితారుణ బంధనమును
సురుచిర పికమధుర శబ్దసూచితముగు నీ
వరనవచూత ప్రసవం
బరుగు నెవని యమ్ముగాగ నంగజ చెపుమా 56

తే-గీ. చెఱకువింటికి గుణమెక్కఁబఱతు వెప్పు
డట్టి యళిపఙ్క్తిగురుశోక నైననన్ను
ననుసరించుచు నేడ్చుచున్నట్టులుండెఁ
గరుణనిస్వనవిరుత ప్రకారములను 57

క. రతిదూతీపదములఁ బర
భృతికిన్ మధురప్రలాప విధవిజ్ఞతమన్
బ్రతిపాదింపుము ప్రియ! యా
స్థితసుందర తనుఁడవగుచుఁ జెచ్చెరమరలన్ 58

తే-గీ. ఫాలఘటితాంజలిక్రియా ప్రార్థితములు
వేపథుయుతంబు లేకాంతవిషయములగు
గౌఁగిలుల నట్టిరతములఁ గలితు నెడఁదఁ
దలఁప నెట్లగుశాంతి కందర్ప! నాకు 59

క. సురతకుశల నేర్పు మెయిం
గరము ముదముతోడ నీవు కావించు సుమా
భరణము మాత్రము కనఁబడె
వరయఁగఁ గనరాదు నీదునంగ మనంగా

తే-గీ. అకట దారుణ కృత్యులా నా సురలోగి
దేనిపరికర్మము సమాప్తినూనకుండ
నిన్నుఁదలఁచిరి వేఁడెద సన్నుతాంగ
రమ్మ డాకాల మిగిలిన రాగమీడఁగ 60

తే-గీ. అనలమార్గంబుచే నిన్ను ననుసరించి
మరల సంకంబు నాశ్రయింప నరుదెంతు
చతురమగు సురకామినీజనము నిన్ను
ననువుమెయిఁ జేరి వేగ లోఁగొనక మున్న 62

తే-గీ. అనుసరించెద గాని నిన్నెట్లులైన
రమణ నాకెట్లుతొలఁగు నీరద్ది జగతి
మదను నెడఁబాసి రతి క్షణమాత్రమింకఁ
బ్రితికియున్నది నారె యొవ్వని జనములు 63

తే-గీ. అన్యలోకాంతర గతుండ వైననీకు
నంత్యమండన మెభ్భంగి నాచరింతు
జీవితమ్మంగక మ్మవిశేషవృత్తి
నొక్కసారిగ నిట్లాట నుజ్వలాత్మ 64

క. చాపంబు నంకమందిడి
యాపూసర మార్జవంబు నందించుచు నే
త్రోపాంతస్మిత సుకథా
లాపంబుల మధునిదెలుచు లాగు దలంతుఁ. 65

తే-గీ. కరము హృదయంగముఁడు చెలికాఁడు మధుఁడు
కుసుమముల నెల్లనీకు ముల్కులనొనర్చు
నతఁడు నుగురోషుఁడౌ నిటలాక్షు కంటి
మంటలోఁబడి నిన్ను వెన్నంటఁడుగద 66

వ. అనియివ్విధంబున నాశశాంకవదన మదనునుద్దేశిం

చి యనేకప్రకారంబుల విలపించుచుండ నవ్విలాపవచనంబు
లు విషలిప్తశరంబులై యెడఁద విదళితంబొనర్ప నయ్యాతుర
నూరడింపఁగా నయ్యామని చయ్యనఁ దోతెంచుటయు. 67

క. ఆతని జూచిన యంతట
నాతతముగ నురముఁ గుచము లదురిన నడచుచుఁ
నాతియుఁ గిలగిల నేడ్చెను
జ్ఞాతులగని పొంగు శోకజలనిధి యెందుఁ 68

తే-గీ. అట్లుదుఃఖించి దుఃఖించి యతివమిన్న
పలికెఁ జూడుము మిత్రునివస్థ మధుఁడ
పావురముఁవోలి శబలమౌ భస్మగూడ
గాలి దిక్కుల వెదజల్లఁగాఁదొడంగె 69

తే-గీ. మధుఁడు నినుఁగన గోరెడి మదనుఁడిపుడు
సౌహృదయ్యమెలర్ప దర్శన మొసఁగుము
ధర సఖిస్నేహ మనవస్థితమ్ము నరుల
కధిగుణమ్ము సఖిస్నేహ మచలముగద 70

ఆ-వె. పార్శ్వవర్తియగుచుఁ బఱఁగు నీతఁడె కాడె
ససురపూర్వసురము జగమునెల్ల
సూనశర! మృణాళసూత్రి మౌర్వికమౌ
ధనువుతోడ నమిత్రర మొనర్చు 71

తే-గీ. పవనతాడితమైన దీపంబుపగిది
పోయెన మరుండు మఱిరాఁడు పోవసంత

బహుళధూమ పరిసక్తమౌ వర్తిపోలె
నుంటి నవిషహ్యదుఃఖంబు నొందికంటె 72

తే-గీ. కాముని వధించి నను వీడు కారణమున
వైధకృతమయ్యె నిటు లర్థవైశసమ్ము
వ్యపగతాపాయమగు నాశ్రియద్రుమంబు
హస్తిహతమైన లత పతనార్హ కాదె. 73

తే-గీ. కాన నాయందు దయయింత గల్గెనేని
విధురసగునాకు వహ్నిపరివేశమొసఁగి
జీవితేశ్వరుచెంతకుఁ జేరునట్లు
లోనరుపు మిదియ బంధుప్రయోజనంబు 74

క. నెలతోఁ బోవును వెన్నెల
జలదముతో నరుగు మెఱుఁగు చయ్యన నవివే
కు లెఱింగినమార్గంబిది
వెలఁదులు పతితోఁ ద్రోవఁబట్టి వెడలుట సౌమ్యా

తే-గీ. ప్రాణనాయకు సుందరాపఘనభస్మ
మంగమున కంగరాగంబు నాచరించి
యలరు నలరాకు గమిసెజ్జయందుఁబోలె
తనువు నునిచెద ముదమున ననలమందు 76

క. కుసుమాస్త్రునకును నాకును
గుసుమాస్తరణంబుఁ గూర్తు కుశలత మెఱయన్

రసికా యట్టులఁ బతితో
వెసఁజనఁ జితిఁగూర్పుమయ్య వేఁడెదనిన్నున్ 77

క. అంతట మదర్పితానల
మెంతయు మలయానిలముల నెసగొల్పుము నీ
స్వాంతమున విదితమేగద
కంతుఁడు ననువీడి నిలువఁగా లేఁడనుచున్ 78

క. మాధవ! మఱివిను మొకడఁగు
పాథోఽంజలినిడుము మాయుభయులకు నచ్చో
నాధిఁదొఱఁగి నాతోనా
నాథుఁడొకట ద్రావగలఁడు నంద్యుఁడవగుమీ

తే-గీ. వినుము వెండియుఁ బరలోక విధులయందు
లోల పల్లవ చూతగుచ్ఛాళి నంపు
మెఱుఁగుదువుగాదె మాధవా యెప్పుడైన
మరుఁడు ప్రియఁపడు సహకారమంజరులకు 8

క. ఘనవర్త్మవాణి యీగతి
తనువును విడనున్నరతికి దయగలదై తో
చెను హ్రదశోషణమున నా
ర్తినిగను శఫరికిని ప్రథమవృష్టియుపోలెన్

ఉ. నీమగఁ డంబుజానన యనింద్యచరిత్రకు నప్రజాపతి
న్గాముకుఁజేసె బల్మిఁ దనగాదిలికూఁతురు నందువాణియం

దామహితాంతరాత్ముఁడును నల్గి హరాసలకీలికాళి నో
హామ! వహింపుమీ శలభభావమునంచు వచించె నంతటన్.

మ. దయతో ధర్ముఁడు తన్ను శాంతిపరుప న్దద్దేవుఁ డాశాపసం
క్షయముంగూర్చ్వచించె నీశ్వరుఁడు తచ్ఛైలేంద్రపుత్రీతపో
మయపాడ్గుణ్యవశీకృతుండౌచు సుఖింపన్ బోవుచోఁగాము న
వ్యయుఁ జేయున్మనులున్మొగిళ్ళమృతవజ్రాసారులంచు న్వెసన్.

ఉ. కావున నీదుభర్త సుమకార్ముకపత్ని యదుర్లభుండగు
న్దావక దివ్యదేహము నుతప్రియసంగమ యోగ్యమౌటచేఁ
గావుముదీని శోభనసుఖా! రవిదీధితిపీతవారియౌ
శైవలినిం గనంబడు బ్రశస్తరుచుఁరంబు తపాత్యయంబునన్. 84

వ. అనియివ్విధంబున నదృశ్యరూపంబగు నబ్భూతం
బు మరణంబ శరణంబని కరణంబుల ననలంబున కాహుతి
నొనర్ప సమకట్టియున్న యన్నలినసాయకు రాణితోడఁ గరు
ణాపరాయణతఁ బలుకనప్పలుకుల నతి విశ్వాసంబున నంగీక
రించి యక్కుసుమాయుధబంధుండు సుచరితార్థప్రదంబులైన
వచనమ్ముల నయ్యంతి నూరడించిన. 85

క. ఆతరుణీమణి విరహో
పేత యగుచు విప దవధిని వేఁడుచు నిసభా
నీతపరిభయగు శశికళ
రాతిరినిం బొందనున్న రహిని వహించెన్ 86

క. గిరిజయుఁ దపకట్టెదురఁ
గిరిశుఁడు కనుమంట మీనకేతను మృతుఁగా
గరిమంబున నొనరిచి తా
నరిగిన విధమెఱిఁసి యంతరంగమునందున్ 87

చ. పొలతుక యిట్టిరీతిఁ దలపోయఁగఁ జొచ్చెఁగటామనోజ్ఞలై
కొలములు శీలముల్ గలిగి కోరివరింప మనోనుకూలులై
యలరుచునుండుఁ గాంతుల నపాంగనిరీక్షణలోలులంబొన
ర్చు లలన లాచరించిన విశుద్ధతపంబుల నెంచశక్యమే 88

సీ. అందంపు పూగుత్తులం దగు తీవ మా
కందంపు పొందును బొందకున్నఁ
దారహారములచేఁ దళ్కొందు శ్యామ తాఁ
జేరిక రాజుతోఁ జేయకున్నఁ
దిలకాదికంబుచేఁ జెలఁగు వనీలక్ష్మి
గండుఁగోయిలఁగూడి యుండకున్నఁ
గమలాంబకములచేఁ గ్రాలెడి సరసి యా
రాయంచతో మెప్పు నీయకున్న

తే-గీ. నకట లోకైకసుందరి యనఁగ బఱఁగు
పడఁతి యనురూపు నొకనిఁ జేపట్టకున్న
భవ్యభాగ్యంబులేల వైభవము దేల
విదితకులమేల సౌందర్య మదముదేల. 89

సీ. అభిజాత్యము మేలు సరయఁగా వలెనన్న
శైలాన్వవాయంబు సత్తమంబు
తండ్రి సామాన్యుఁడే తా హిమవంతుఁడు
సర్వసర్వంసహా సహనచణుఁడు
తల్లి సాధ్వీమణి తాపసి పితృదేవ
భామమానససీమఁ బుట్టువందె
నన్న మైనాకుండు తన్నాకధవవజ్రి
భూరిక్షతానను భూతపీడుఁ

ఆ. వే. డట్టివారలైనఁ బట్టి యెట్టిదానాఁగఁ
బుట్టువలయు లచ్చి యెట్టులేనిఁ
బాలకడలిలోనఁ బండ్రెండుమారులు
మత్తనూకళా సమత్వమంద 90

సీ. కైలాసమునకేగి బాలేందుధరుమ్రోలఁ
గేళిగోష్ఠులఁ దేనెఁ గ్రోలి వెడలి
వైకుంఠ పురిఁజేరి యాకృష్ణుదరిఁ గోరి
కొంత ప్రసంగంబుఁ గొనియ మఱలి
యజు ప్రోలునకుఁ బోయి గుజగుజమని కొంత
కొంతమాట్లాడి యాచెంతఁ బాసి
యిందునోద్ధకుఁబోయి సాంద్రవిహారంబున
నావిధంబు వచింప యనుమతించి

ఆ-వె. కాక నాకమాని యేకారణంబునఁ
దొల్లి వెల్లడించు నల్లపలుకు
గిరికులాధిరాజ గిరిశుండు నీయల్లుఁ
డగును నమ్ముమనుచు నాదినమున 91

క. ఆతని పలుకులువినికద
తాత నను౯ లసదనూనతను విలసన న
భ్యాతపతిఁ గొల్వఁబంచె న
పేతభయుండగుచు జయయు విజయయురాగ౯ 92

చ. తొలిజనియందునన్బొసఁగుదోసఁపురాసులనాయభాగ్యమే
చెలులకు నాకు నాతెఱఁగు చేసెనొ కాకల కంతుచేతకుం
గలిఁగిన రోస మగ్గలముకాఁగ మసింబొనరించి యాతని
న్నిలిపిన నొంటిపై యటులునిర్ఘృణుఁడేగెనొ చెప్పవచ్చునే.

సీ. ఆనాఁటి వాసంత సూనావళులొకింత
మానంబునొంపఁగాఁ బూనుకొనవొ
యానాటి శుకపికీ నానారవములింత
మానంబునొంపఁగాఁ బూనుకొనవొ
యానాఁటి సురసతీ గానామృతములింత
మానంబునొంపఁగాఁ బూనుకొనవొ
యానాఁటి యాస్మద మీనాభదృశలింత
మానంబునొంపఁగాఁ బూనుకొనవొ

తే. గీ. లోలులగువారి లోఁ గొనఁజాలుఁ గాని
యానిటలనేత్రు వంచింపఁ గా నొనర్ప
నేర వేవిధిఁగనిన సందియమునుండ
దిట్టవానికి నతనికి నెంతదవ్వు. 94

తే. గీ. దుష్కరంబు దురాపంబు దుస్తరంబు
దుర్గమా నెద్ది యట్టివస్తుతతి సాధ్య
తనము దురతిక్రమంబగు తపమువలన
ననుచు వచింతు రిజ్ఞు లైనట్టిజనులు. 95

క. కావునఁ బూనికయొప్పక
నావనజదళాక్షు లిరువు రరుదేరఁగ నే
నేవిధి నైనను జని వని
శైవానుగ్రహముఁ నొందఁ సల్పుదుఁ దపమున్ 96

వ. అని యాహరుని మనోహరునిగ వరించి యం
చితంబగు తపంబొనరించెద నను నాగట్టురాపట్టిపట్టిన పట్టు
నెట్టని మరువెట్టఁగోరి యమ్మేనక యొకనాఁడు తనకూతుఁ
గౌఁగిటఁజేర్చి యామెతో నిట్లనియె. 97

తే. గీ. మనగృహంబున లేరెట్లు తనయ! వేల్పు
లాతపంబేడ నీదుకాయం బిదేడ
యళిపదమునోపుఁగాని మోయఁగఁ దరంబె
పతఁగపదము శిరీషపుష్పమున కెందు. 98

తే. గీ. అని యిటులు బోధసల్పియుఁ దనయ మనసు
నేరకంబున మరువెట్ట నేరదయ్యె
నీప్సితార్థస్థిరంబగు నెడఁద నిమ్న
సమ్ముఖజలంబు మరలింపఁ జాలు నెవఁడు 99

క. ఆసన్నాళిముఖంబున
నాసతి యొకనాఁడు తండ్రి సభిలాషజ్ఞున్
ఆసత్ఫలోదయంబు ని
వాసము వనమందు సల్పుపని యాచించెన్. 100

మ. అనురూపాభినివేశతోషితయగునయ్యన్వేగ వీడ్కొంచున
వ్వనితారత్న మొనర్పఁగోరి తపము న్వాంఛోదయాంతంబుఁగా
జనులంబొందె మహాపవిత్రం దదభిధాంచచ్ఛృంగరాజంబు దా
నిని గౌరీశిఖరంబును జనియె సందీవ్య చ్ఛిఖండీశ్వయమున్. 101

తే. గీ. చలములగు యష్టుల విలుప్తచందనము ల
హార్యనిశ్చయ హారంబు లచటు వాయ
భాను నుద్యత్ప్రభంగొన్న వల్కలంబు
లవలఁ గుచసీమ నొడుచు నాక్రమించె. 102

తే. గీ. భూపితశిరోరుహంబులఁ బోడిమిఁగను
భంగి భూషితమయ్యె నబ్జాల మోము
షట్పద శ్రేణినగు శోభ జలజమునకు
శైవలాసంగముననఁగూడ సంభవించు. 103

తే. గీ. త్రిగుణమగు మౌంజి నతివ ధరించె వ్రతము
కొఱ కెపుడు రోమచయము గగుర్పొనెనయఁ
దత్ప్రథమ సన్నిబద్ధమౌ దానిచేత
నంటె రాగంబు రశనాగుణాస్పదంబు 104

తే. గీ. త్యక్తలాక్షారసంబగు నధరమునుఁ గు
చాంగరాగారుణీకృతం బైన కందు
కమును వీడి కుశచ్ఛిదాక్షతమగు కర
మక్షసూత్రంబు బ్రణయంబు నాచరించె 105

క. నునుపాన్పునఁ బవళింపఁగఁ
దన తల పూవులను గల్గుఁ దనువున కతివే
దన యట్టితాను నిద్దురఁ
దనరారెను దోర్లతోపధాయనిగ ధరఁ 106

తే. గీ. లేఁత లతల విలాసంపు లీల లోలి
లోలదృష్టుల నేణాంగనాళియందుఁ
దరుణి దాచెను స్వనియమాంతమున మరల
స్వీకరింపఁగ నెంచి నిక్షేపమట్లు. 107

తే. గీ. కాంత నిస్తంద్రియై వృక్షకముల నోలి
ఘట కుచప్రస్రవణముల నటులుపెనిచె
నాదిఁ బొడమిన వానిపై నలరు పుత్రి
వత్సలతఁ బాపనేఱఁడు బర్హిరథుఁడు. 108

తే. గీ. కుతుకమునఁ దమకన్నులఁగూర్చి చెలుల
కనులఁగొలుచుటకోపి శంకనుద్యజించి
వన్య బీజప్రదాన విశ్వాసమొప్పఁ
జెలఁగె మృగులు తదాశ్రమ స్థలమునందు. 109

మ. ఘననిష్ఠన్రిచితాభిషేక హుతభుక్ప్రాప్తిప్రాజ్యయు న్సాధ్వనీ
తినియు న్గ్రిత్రికృతోత్తరీయయగు నద్దేవి న్విలోకింపఁగా
మునిబృందారక బృందముల్ వెడలుచు న్మోదంబుతో నేగుదెం
చెను ధర్మాధికులందు నవ్వయసు యోజింపంగఁ బోరెవ్వరున్.

తే. గీ. వైరి సత్వంబు లాత్మీయవైర ముడుఁగ
నగము లిష్టప్రసూనార్చి తాతిథులుగఁ
బర్ణశాలల వహ్నులు ప్రజ్వరిల్ల
పావనంబయ్యె గౌరీ తపోవనంబు 111

తే. గీ. చేయుచున్నట్టి తపములచేత నాత్మ
కాంక్షిత మలభ్యమని యెప్డు గౌరి తలఁచె
నప్పు డంగంబు మార్దవమైనఁ దలఁప
కాచరింపఁ దొడంగె మహాతపంబు. 112

తే. గీ. బంతులాడెడి వేళల బడలునట్టి
రమణి నిష్ఠురమునిచరితమున వొలిచె
నజుఁడు కనకాబ్జమునఁ జేసె నంగమనక
సహజమార్దవ సహసార సరణి యెట్లు. 113

తే. గీ. గ్రీష్మకాలంబునం జతుష్కీలులకును
మధ్యభాగంబు నంది సుమధ్య యంత
దృష్టిరోధప్రభాకరు దివసకరు న
నన్యదృష్టిని గ్రహించె నబ్జవదన. 114

తే. గీ. రవిగభస్తులఁ దప్తమౌ రామమోము
సారసశ్రీఁదనర్చె నుచ్ఛ్రియములగు
కన్గొనలయందు మాత్రము కానవచ్చె
నల్లనల్లన మృదువగు నల్లఁదనము. 115

తే. గీ. అప్రియత్నోపనతములౌ నట్టిజలము
లమృతమయుఁడైన చందురు నంశువులును
పారణావిధికయ్యె నప్పద్మముఖికి
ధరణిరుహావృత్త్యభిన్నసాధనకు నపుడు. 116

ఉ. ఇంధన సంభృతానల చయేనఖరాంశు నికామతప్తమై
గంధగజేంద్రయాన యుదకంబున నుక్షితయౌచు గ్రీష్మసం
బంధము పోవుకాలమున బాష్పము నూర్ధ్వగమున్ద్యజించెఁ బు
ష్పంధయమాల్ చికాకుపడ క్ష్మాసతితోసరిగా ననూనతర్ష

మ. క్రిమవర్షాగతబిందుబృందమొగిఁబక్ష్మప్రాంతమందుండియో
ష్ఠము మర్దించి పయోధరోపరి మహీసంపాతసంచూర్ణిత
త్వమునుంబొంది వళిస్థలి స్ఖలితమైవామాక్షి నాభీప్రదే
శము నెట్లోచొరఁబారి నిల్చెను పథిశ్రాంతి న్విసర్జించుచున్.

క. ఎడతెగక గాడ్పుగలిగిన
జడివాన శిలాతలమున శయనించిన యా
పడతి తపస్సాక్షిణు లన
బడు నిశలు మెఱుఁగు కనులఁ బరివీక్షించెన్. 119

శా. శీతస్ఫీత మరుద్విరుద్ధ రజనీక్ష్వేడ త్సహాస్యంబొగిన్
స్రోతోవాస తపంబునం గడపె నాశుద్ధాత్మ బద్ధానుకం
పాతివ్యక్తిఁ బురోవియుక్తమయి యన్యోన్యస్పృహాక్రందనా
ర్తాత్మాంతంబౌ హరిహేతిహూతి పతగద్వంద్వంబుపై జాలితోన్.

ఉ. శోధితపాద్మగంధ మతిసుందరదృఙ్మధుపంబు వేపమా
నాధర పత్రశోభితము నైన ముఖంబున శీతవృష్టిసం
బాధితపద్మజాతమగు వారికి వారిజసంపద న్గడు
న్బాధర సార్వభౌమసుత పూని యొసంగెననం బ్రకాశిలెన్

తే. గీ. పండిరాలిన యాకుల భక్షణంబు
పరమమగు కాష్ఠయనిరి తపంబునందు
తరుణి దానిన్ దృజించె నద్దానఁగాదె
ప్రాజ్ఞులామెను లామె నపర్ణ యనుట 122

శా. నాళీకాంకుర పేలవంబు దనువు న్నానావ్రతౌఘంబుల
న్బాలేయాచలకన్య యువ్విధి దివారాత్రంబు బాధించుచు
న్నీలంబొప్ప నొనర్చు న న్నియతి వాసింజెందఁ గ్రిందయ్యె న
వ్వేళం దారుణతాప స్వార్జిత తపోవిఖ్యాతు లాఖ్యాతికిన్ 123

వ. అట్టు లమ్మహాదేవి తపంబొనరించుచుండఁ గతి

పయవాసరంబులు గడచినంత నొక్కనాఁడు. 124

సీ. తనహస్తిచర్మంబు తళుకు దుర్దర్శమై
యనుకూలమగు మృగాజినము గాఁగ,
దనతలనెలతునక నునువెన్నెలల డాలు
భస్మాంగరాగ సంపదకుఁ గూర్పఁ
దనచేతి శూలాయుధంబు మానులకెల్ల
శమ్మొసంగెడి పలాశమ్ము గాఁగ
భక్తొద్ధీర్ఘానుభావ పరిభావంబు
నియత ప్రగల్భవాఙ్మయము గాఁగ

తే. గీ. వ్యాళములు శుద్ధరుద్రాక్ష మాలికలుగఁ
గరమునఁ గపాల మర్ఘ్యభృంగారము గను
హరుఁడు కుహనావటుత్వంబు నవధరించి
యల్లనల్లన వచ్చె నయ్యతివకడకు
మైనలరుచున్న ప్రథమాశ్రమంబనంగ 125

తే. గీ. అట్లువచ్చిన వర్ణిసు నాతిథేయి
గౌరవపురస్సరంబుగఁ గానఁబోయె
వ్యక్తిభేధంబుల న్నివిష్టాత్ములకు వి
శేషగౌరవకృత్యముల్ చెల్లునెపుడు 126

తే. గీ. ఆగమోదితవిధికృత మర్చనంబు
నంది శ్రమఁదీర్చికొనుచున్న యట్టులుండి

యతఁ డుమను సాధుదృష్టిచే నరయుచుండి
పలుకఁగాఁజొచ్చెఁ గ్రమమెడఁబాయకుండ. 127

క. రమణీ! సమిత్కుశమును సుల
భమె? జలము వగాహవిధికిఁ బాత్రమె? తపము
దమి నోపి చేతువే? దే
హము తొలిసాధనము ధర్మమందు మెలంగన్. 128

తే. గీ. లలన! చిరకాలసంత్యక్తలాక్షమైన
యట్టి నీమోవినింబోలు నలరుగములు
వరుసతప్పకయున్నె? లీవలకు నబల!
నీవుపోయుచునున్నట్టి నీటివలన. 129

తే. గీ. ఉత్పలేక్షణ! నీయఁటిఁయుఁగ్మసమత
నేర్చుటకుఁబోలె నీయొద్ద నిలిచి ప్రణయ
వశత నీచేతనుండు దర్భలహరించు
హరిణములపైని నీమనసలుగదుగద. 130

క. వరసౌందర్యము పాపా
చరణమునకు కాదటంచు జను లనెడినుడుల్
తరుణి! నిజము నీశీలము
పరమానులకు నుపదేశ భావముఁ గనుటన్ 131

తే. గీ. అంబరతలంబువలన చ్యుతంబు పుష్ప
కలిత సప్తర్షిపూజహూ గాంగజలము

కంటె నకలుషమైన నీ గాథవలన
పూతుఁడయ్యెను సలుఁకుడై భూధరుండు 132

తే. గీ. అర్థమునఁ గామమునఁగూడ నాసవీడి
జరుపుచుంటివి ధర్మ మాసక్తితోడఁ
గాన మానిని! యాత్రివర్గమున నఱయ
నదియ సవిశేషమనితోఁచె నంతరమున 133

తే. గీ. అతివ నీచేయుసత్కృతు లందినట్టి
నన్ను నోరునిఁగఁ దలపోయ నయముగాదు
సన్నతాంగి! మహాజనసంగతంబు
సప్తపదసాధ్యమందురు సాధుజనులు 134

తే. గీ. బ్రాహ్మణుఁడఁగాన నాత్తచాపలుఁడనగుచు
నోర్పుకలనిన్నుఁ బృచ్ఛసేయుదు నొకింత
గోప్యమయ్యదికాకున్నఁ గువలయాక్షి
యుక్తముగ మాకునిమ్ము ప్రత్యుత్తరమ్ము 135

తే. గీ. మొదటి బ్రహ్మకులమ్మునఁ బుట్టినావు
తనువు త్రిజగత్సముదిత సౌందర్య మింక
సంపద లమృగ్యములు వయస్సంస్థ క్రొత్త
యింతకంటె తపఃఫలం బేదిచెపుమ. 136

తే. గీ. ఓపరాని యనిష్టము నొందినట్టి
యువిద కిట్లుండు టెంతయు నొప్పఁగాని

యది విచారపథపరిహితాంతరంగ
మునఁ దలంపఁగ నీయందుఁ గనఁగరాదు. 137

తే. గీ. పడతిరో యలభ్యశోకాభిభవము రూపు
పితృగృహంబున నవమానవిషయ మెట్లు
పరతిరస్కృతి నీకెట్లు వాటిల దెవఁ
డహిఫణామణికై చాచు నాత్మకరము. 138

తే. గీ. ఏల వయసున నాభరణాళి వీడి
ముదుసలులకించు వల్కలమ్ము నిటుదాల్తొ
యిల ప్రదోషంబునందుఁ జంద్రిక సహిత
యా విభావరి యరుణున కనర్హయగునె. 139

తే. గీ. దివము నర్థింతు నన్ను నిందీవరాక్షి
జనకుదేశము దేవతాస్థలమకాదె
యరయ నుపయంతగోరుదు నందువేమొ
రత్నమఱయునె కొనువానిరాజవదన. 140

తే. గీ. వెచ్చనిట్టూర్పుచేతనే విదితమయ్యె
నైన నామది సందియం బంకురించెఁ
గోరఁదగినట్టివారలు లేరునీకు
ప్రార్థితాప్రాప్యు లెట్లుంద్రు పడఁతి! చెపుము 141

తే. గీ. నీవుకోరిన వరుఁడౌర నిష్ఠురుండు
కర్ణకైరవహైన్యవ ద్గండతల వి

లంబ కలమాగ్రపింగళ శ్లథ జటాక
లాప మీగతిఁ గన్గొన నోపెఁగాన! 142

తే. గీ. భాస్కరాప్లుష్ట భూషణాస్పదవు మాసి
నియమకర్శిత వైనట్టి నీవు పగటి
వేళ శశధరకళవోలె విదుర్మిమోష్ఠి
చూడ నెవ్వని మనసింత పీడవడదు. 143

ఉ. నీమగనిం గుమారు నవని న్సుభగత్వమదప్రవంచితుం
గా మదినెంచెద న్మతియెకం డకటా చతురావలోకియు
న్వామమరాళపక్ష్మమగు భవ్య భవన్నవ దృష్టిసృష్టికిన్
శ్రీమహితాత్మవక్త్రమును జెచ్చెర లక్ష్యమొనర్పకుండుఁ నే

తే. గీ. ఎంతకాలము శ్రమపడెదింతి యిట్లు
తనకుఁ బూర్వాశ్రి మార్జితతపము కలదు
దానసగమిచ్చెద న్బ్రియతమునిఁ గొనెద
వటివ విననెంతుఁ జెప్పుమా యతని తెఱఁగు 145

వ. అని యివ్విధంబున నవ్వర్ణియప్పువ్వుఁబోఁడితోడఁ బలుక నాయుమయు నిజాభిమతంబు నుడువనోడి తోడనున్న చేడియకుఁ గనుసన్నయొసర్ప నవ్వయస్యామణి యిట్లనియె

ఉ. ఈహరిణాంగనాక్షి కథ నిమ్ముగఁ దెల్పెద నాలకింపు కౌ
తూహలమున్న భూసుర! చతుర్ది గధీశులనీసడించి ని
ర్మోహునరూపహార్యుని హరుంబతిఁగాఁగొన నెమ్మనమ్మునం
దూహ చెలంగ నీక్రియల నుద్యమ మద్యతనంబొనర్చెడిన్.

తే. గీ. వారిజము ఛత్రిముఙ్జేయు వారిఁ బోలి
తపమునకమర్చె నిమ్నుగ్ధ తనువు నింతె
పరిణయంబేడ నజగవపాణియేడ
మదననిగ్రహమున వాని మహిమ తెలిసె. 148

తే. గీ. హుమ్మనఁగ నుగ్రుఁ డాతని నోపలేక
మేనుబోయిన సుమబాణు మేటిబాణ
మోతపస్వివరా! యీమెచేతమందు
వ్యాయతాపాతముగ నాఁటి వ్యథనొసంగె 149

తే. గీ. అంతనుండియు జనకగృహంబునందు
దా నొకండగు క్షణము నందద సుఖంబు
నధికమదన జ్వరార్త యీ యతివమిన్న
శీతసంఘాత మసృణాశ్మ జాతమునను 159

క. కలకంఠి బాష్పకంఠ
స్ఖలిత పదంబులను గరళగళు నపదానం
బులఁగొనఁ జెలులగు కిన్నర
లలనలు వినుచుండ్రి బాష్పలవములు వెడలన్.

ఉ. రాతిరులందు మానినిఁర! రాజముఖీమణి కన్నుమోడ్చి తా
నాతఁడెయం దసత్యనిహితాభవకంధర బాహుబంధనో
పేతయునొచు బోదువెటుఁ బ్రేమపదా! యని కన్నువిచ్చి య
త్యాతతమూర్ఛమున్గుఁ దదదర్శనమా వ్యవశంవదాత్మయై.

తే. గీ. సర్వగతుఁడవటంచు ని న్సకలబుధులు
నెంచుచుండుదు రట్టినీ వెఱుఁగ వెట్టు
లీజనంబు నటంచు నీరాజవదన
స్వకరలిఖితుని హరు నిందసలుపు నొంటి. 153

వ. ఈచందంబున నీయిందీవరాక్షి యయ్యిందుకలాధరుఁబొందెడి కందువుఁ గానమి డెందంబునఁగుందుచు నాగ్రహంబున నుగ్రతపం బొనరించినఁగాని యుగ్రునుగ్రహంబు సుగ్రహంబుఁగాదని యెంచి యుచ్చరితంబున వియచ్చరు లచ్చెరువొందఁ గాలంబుఁ బ్రతిపాలించుచున్నయది.

తే. గీ. తాను పెనుపఁగఁ బెఱుగు పాదపములెల్లఁ
దపమునకు సాక్షులై ఫలతతి నొసంగ
నిందుశేఖరసంశ్రియ మీామెకోర్కె-
చిగురుపెట్టంగనైన నీక్షింపఁ బడదు. 155

క. అతిమాత్రితపఃకృశ నీ
యతివ ననావృష్టినిహతయా కృష్టధరణ
గ్రితుభుగ్వరుఁడట్లు హరుం
డతులకృపం జూచు టెపుడొ యవనిసురేంద్రా.

తే. గీ. అనిపలుకు నామెపలుకుల నాలకించి
సుదతిఁగన్గొని నైష్ఠిక సుందరుండు
హర్ష లక్షణముల దాచి యతివ! యింత
నిజమొ పరిహాసమో తెల్పు నీవ యనిన. 157

క. ముకుళీకృతాంగుళికమగు
స్వకరాగ్రము స్ఫటికమాల సవరింపఁగ న
ద్రికుమారిక పలికెఁ జిర
ప్రకటితమితవర్ణమైన వాచిక మెటులో. 158

తే. గీ. వేదవిద్వర! లెస్సగా విన్నవాఁడ
వీజనం బున్నతపదాప్తి నెడఁదఁ గోరుఁ
దపము తత్ప్రాప్తిహేతువా? తలఁపఁ గలుగ
దవిషయంబు మనోరథావాప్తి కెందు. 159

ఉ. నావిని యాతఁడిట్టులను నావినియుండనివాఁడెశంకరుం
డోవరవర్ణినీ ! మరల నుగ్రవిభుత్వముఁగోరుచుంటివా
మావిగతుండు సంతతమమంగళభావ రతుండు గాన న
ద్దేవుని నీవుకోరుపాలితి న్వ్యాణుకోదరి! నేను మెత్తునే. 160

క. ఉరగంబులఁ జుట్టినహరు
కర మాసంజిత వివాహకౌతుకమగు నీ
కరమును నవముగఁ గొనుపని
నెఱవేరునె తుచ్ఛవస్తునిర్బంధపరా. 161

తే. గీ. వనిత! నీవేతలంపు నెమ్మనమునందు
లలితకలహంసలక్షణోల్లసితమైన
వరదుకూలంబు శోణితవర్షి మదగ
జాజినము ముడి వెవయోగ్యములో కావో. 162

చ. అరియుసహించు నెవ్వఁడుహిమాంశుసమానన! మేలిపువ్వులం
బరచిన యాచతుష్క-గృహ భాగములన్మెలగంగనొప్పులా
త్మరుచిర పాదచిహ్నముల శావమహాభసితాస్థికంటకో
పరిగత కేశభీతికర పైతృకభూములయందుగాంచఁగన్. 163

మ. సుకరంబే యగుఁగాక త్ర్యంబకుని వక్షోదేశ మస్లైనఁదా
వకవక్షోజములందుఁ జందనరసవ్యాప్యంబులందోలిఁ బై
తృక భూభస్మరజంబు పెట్టు నడుగు న్దేవీ! విచారింప నిం
తకు వేరేదియయు క్తరూప? మిభయానా! చెప్పుమిప్పట్టునన్

చ. మఱియొకఁడైనగేలి యిది మానవతీ! పురతః పరిస క్తమా
నరయుము పెండ్లియాటకుననంతరమందుగ జేందరివాహ్యవై
పరగెడినీవు వృద్ధవృషభంబుననుండఁగఁజూచి యెంతయుం
బురముననుండు సాధుజనపుంజము సస్మితవ క్త్రిమయ్యెడిన్.

తే. గీ. అశివ! రెండిట్టు శోచనీయంబులయ్యె
నా కపాలిసమాగమ మ్మర్థిఁ గోరి
కాంతిమతియగు కలావంతు కలయు లోక
నేత్రకౌముది వైనట్టి నీవు నరయ. 166

సీ. సౌజన్యమదుండా స్వాయంభువాస్యంబు
గిల్లివైచిననాఁడె తెల్లమయ్యె
సౌశీల్యమందువా శావభస్మాస్థుల
మేనఁ దాల్చిననాఁడె కానిదయ్యె

సౌందర్యమందువా కందామరలు మూఁడు
మొలచిననాఁడె నిర్మ్మలమయ్యె
సౌలభ్యమందువా చేలంబు లేకుండ
బిచ్చమెత్తిననాఁడె విదితమయ్యె
తే. గీ, నిట్టివాఁడని యెఱిఁగియు నిచ్ఛగించి
తాహరునిఁ బొంద నీవేడ నాతఁడేడ
నాగుమీయుద్యమము ననర్థంబు యూప
సుకృతవైదికవిధి చితాశూలమునకు. 167

తే. గీ. చదువుసందెలు లేకుంట స్థాణుఁడయ్యె
నెవరికీతఁడు పొడమెనో యెఱుఁగరాదు
ధనములున్న దిగంబరత్వం బదేల
వరగుణంబొక్కటియు లేదు వానియందు. 168

వ. అనిపలుకు నవ్వర్ణి పలుకుల నాకర్ణించి యాకర్ణాంతవిలోచనయగు నయ్యాపర్ణ కోపంబునఁ బెదవులదుర బొమలు ముడివడ నుపాంతలోహితంబులగు లోచనంబుల నడ్డంబుఁగాఁ ద్రిప్పి యనాదరంబున వానివిజ్ఞానంబుఁ బ్రత్యాఖ్యానం బొనరింపఁ దొడంగె. నీవు పరమార్థంబున హరు నెరుఁగకుంట నిస్సంశయంబు. కాకున్న నిట్టులాడుదువే యలోకసామాన్యంబు నచింత్యహేతుకంబగు మహాత్ముల చరితము హతమతులు దూషింతురు. విశారదు లెద్దియేని హేతు విద్ధానఁగలదని బహుమానింతురు. వినుము నీ వప్పరమేశ్వరునిందించిన వాక్సం

దోహంబు విన్న నేరంబువాయ నానేరిచిన తెలుంగున నయ్యు
దారుని గుణవిశేషంబుల నభివర్ణించి కృతార్థనయ్యెద

తే. గీ. మంగళములను దాల్తురు మహి విభూతి
కాము లట్లు విపత్ప్రతీ కారపరులు
నఖిలశుభదాయకుండు నిరాశుఁడైన
యతని కేటికి గంధమాల్యాదు లివియు 170

తే. గీ. మించు సంపద నొసఁగు నకించనుఁడయి
మసనమున నుండు లోకాళి మనుచుచుండు
భీమరూపుఁడు శివుఁడుగ వెలయు నీశు
నెంతవారలు తెలియంగ నెంతవారు. 171

ఉ. భూసుర!దివ్యభూషణ విభూషితమొక్కొ పినద్ధభోగిమో
భాసురకుంజరాంబర విభాసితమో సదుకూలలీలమో
తాపసకరాజ శీర్ష కలితంబొ సహేందు కలాకిరీటమో
యా సకలేశు మూర్తి నొకఁడారసిచెప్పఁగ నేరఁడెవ్వఁడున్.

తే. గీ. భసితమెంచఁ దదంగసంస్పర్శమంది
జగములకు శుద్ధిఁగూర్పఁగఁ జాలెనోలిఁ
దాండవారంభసంరంభ తచ్చ్యుతంబు
దాని శిరముఁదాల్తు రందఱు దివిజులు. 173

ఉ. శంభుఁడకించనుం డొకవృషంబుననెక్కి పయాణమైననా
జంభమహాసురారియు దిశాగజముండిగి వేగమేగి సం
రంభమునన్ గిరీటమలర న్దగమ్రొక్కి తదంఘ్రులెన్నఁ ని
ర్దంభమునం బొనర్చు సుమదామరజోరుణితాంగుళీకముల్.

తే. గీ. దూషణంబులఁబల్కఁగాఁ దొడరిరైనఁ
జక్కఁగాఁ బల్కితి వొకండు శంభుఁగూర్చి
యాత్మభవునకుఁ గారణమైనవాఁడు
శివుఁడు, తజ్జని మనము లక్షించు టెట్లు

క. చాలు వివాదమ్మిక నీ
వే లలి శివుఁ నెఱుఁగు దట్టులే కానిమ్మా
లీలఁ దనమనముఁ దవిలెఁ
శూలిని నిందించువాఁడు చూడఁ డయశమ్ముఁ.

తే. గీ. పలుక నెంచెడిఁగాఁబోలు వటుఁడు మరల
నోష్ఠపుటము స్ఫురించెడి నువిద! యాఁగు
మధికపుణ్యుల నిందించు నధముఁ డొకఁడె
కాక శ్రోతయుఁ బాపంబుఁ గాంచుఁగాన. 177

క. వేరొక పుణ్యాశ్రమమునఁ
జేరుదు నిటువీడి యనుచుఁ జెచ్చెరఁగొమయుఁ
జారు కుచయుగము చీరము
చీరఁగ నొగిలేచి నడువఁ జింతించుటయుఁ. 178

సీ. గంగాతరంగిణీ తుంగతరతరంగ
రంగజ్జటాటవీ సంగుఁడగుచు
సరసకృపామృత స్యందమానశశాంక
ఖండమండిత శిరస్కుండునగుచు
భావజాత్తవిభూతి భావకరణతా వి

భాసితాయతఫాల భాగుఁడగుచు
నిజదేహసంలిప్త నీరంధ్రసితభసి
తాచ్ఛశోచి ర్భాసి తాసుఁడగుచుఁ

తే. గీ. గరతలబున శూలంబు కాంతులీనఁ
బాపజన్నిద మొప్పఁగా వక్త్రమందు
మందమందస్మితంబొప్ప నిందుధరుఁడు
లీలఁబ్రిత్యక్షమయ్యె నబ్బాలకపుడు. 179

ఉ. ఆహరుఁగాంచి భూధరవరాత్మజ వేపథువొప్ప నొప్పన
ద్దేహమొగింజెమర్పఁగ నుదీర్ణత నెత్తిన పాదమెత్తి న
ట్లే హవణింపఁ బూని నగమేత్తిర దారికినడ్డమైనచో
నాహతయా మహాపగ నయంబునఁ బోవదు నిల్వదయ్యెడన్.

తే. గీ. నేఁడు మొదలుగ దాసుండ నీకునెత్తిఁ
దపములం బెట్టి నను గొంటి తరుణి! యనెడు
చంద్రధరుమాట వినినంత శ్రమము వాసె
నువిద, క్లేశంబు ఫలసిద్ధి నోసరిల్లు. 181

తే. గీ. అంత విశ్వాత్ముకొఱకు నిజాళిచేత
నగజ సందేశమును రహస్యముగ నంపె
మత్ప్రదాత ధరాధరమండలేశుఁ
డని ప్రమాణీకరింపంగ నర్హమనుచు. 182

తే. గీ. ఆళిసంజితసందేశ యగుచు విభుని
సవిధమున నిశ్చలాత్మయా సాధ్వియొప్పె

పరభృతోన్నతముఖియఁ బోచు వాసి మధుని
యందు నిశ్చలయగు చూతయష్టివోలె. 183

తే. గీ. ఆమెపల్కినపల్కుల కోమటంచు
నెట్టెటులో వీడి యమను దా నెదఁదలంచెఁ
బరమ తేజోనిధానుల భవ్యమతుల
సప్తఋషుల మనోభవ శాసనుండు. 184

క. వారలు విశుద్ధతేజోం
కూరలసద్వ్యోమతలులగుచు హరు నెదురన్
సారుంధతీకులై యొగిఁ
దా రావిర్భవముఁ గనిరి తాత్పర్యమునన్. 185

సీ. తీర మందారజోత్కరతరంగ ఖగంగ
నహరహస్సుస్నాతులైనవారిఁ
బ్రవ్రజ్యఁగొన్న కల్పములన హేమవ
ల్కల జపమాలికల్దాల్చువారిఁ
బడగవాలిచి క్రింది బాటసాగెడి వేఁడి
వేల్పుమ్రొక్కులకు దీవించువారి
భూమితోఁ బ్రళయాంతమునఁ దదాదివరాహ
దంష్ట్రి విశ్రాంతులై తనరువారి

తే. గీ. విశ్వయోనికిఁ దరువాత విశ్వశేష
సర్గసంపూరణా విశేషమునఁ జేసి

ప్రీతధాతలు నా జగత్ప్రథితులైన
సప్తఋషులను గాంచె నాస్మరహరుండు. 186

క. పతిపాదార్పితలోచన
పతిదేవత మూర్తత త్తపస్సిద్ధి యరుం
ధతి వారిమధ్య నెకొ్కని
యతిశయమగు దేజమెనసి యలరారెబలే. 187

తే. గీ. అయ్యరుంధతిఁ బరమసంయములఁ గాంచె
హరుఁడు గౌరవభేదంబుఁ బొరయకుండ
స్త్రీలు పురుషులటంచు వర్ణింపరెపుడు
సాధుజనులసువృత్త మాశాస్యమొందు. 188

క. ఆరామఁగనిన నెక్కుఁడు
దారార్థాదరము చంద్రధరునకుఁ గలిగెఁ
ధారుణి సత్పుత్త్రులు తొలి
కారణమగుఁగాదె ధర్మ్యకార్యంబులకుఁ. 189

ఉ. ప్రీత్తనసత్కృతంబు పరిపాకమునంది ఫలంబునీయ నా
సక్తిఁదొలంగి పొందుచు బ్రశస్తతపంబొనరించుచున్న త
ద్వ్యక్తులు సర్వలోకగురుఁదద్దయుఁ బెద్దగగౌరవించి స
ద్భక్తికిమేనులుల్లసిలఁ బల్కె రశులకమహార్థవార్తతిఁ.

తే. గీ. విధివదధ్యయనంబుఁ గావించుటకును
హోమముల నగ్నియందుఁ జేయుటకు నమల

తపములొనరించుటకు సమాధానమైన
ఫలము నిష్పన్నమయ్యె నిప్పటికి మాకు. 191

తే. గీ. నిఖలజగదధిపుఁడవైన నీవమమ్మ
సమభిలాషంబునకును విషయముగాని
నీమనోవిషయంబున నిల్పికొంటి
వింతకంటెను మాకెక్కుఁ డేమిగలదు. 192

తే. గీ. ఎవనిచిత్తంబునందు నీవెనసినావొ
యాతఁడొక్కఁడ కృతులలో నగ్రగణ్యుఁ
డట్టి బ్రహ్మనిదానుండ వైన నీదు
మనము నెక్కినవాని నేమనఁగవలయు. 193

తే. గీ. అర్కుకంటెను శశికంటె నధికమైన
పదమునందఁగఁ గంటి మిప్పటికిమున్న
నీవు నెమ్మదిఁ దలఁచుట నిరవధియగు
నుచ్చతరమగు స్థానంబు నొందినాము. 194

క. త్వదనుధ్యానభవంబగు
ముదమేమని తెల్పుదుము విభూ! సర్వము సం
విదితాఖిల జంతుమన
స్సదనుండవు నీవెఱుఁగవె చంద్రార్ధధరా. 195

తే. గీ. అరయుచుంటిమిగాని ప్రత్యక్షముగను
తెలియఁజాలము నిను దత్వదృష్టిచేత

బుద్ధ్యతీతుండవగుట, నీపొలుపుఁదెలిపి
మమ్ము దయఁజూడుమో జగన్మాన్యమూ_ర్తి. 196

తే. గీ. భువనములనెల్లఁబుట్టించు మూ_ర్తియొకఁటి
విశ్వవిశ్వంబుఁ బాలించు వేరయొకటి
యరయ నొక్కటి గూర్చు సంహారవిధము
భూతపతి! యెద్దియుద్ది యమ్మూ_ర్తిలోన. 197

క. ఐన మహాప్రార్థనయిది
పోసీ యటులుండనిమ్ము మున్మున్ను మముం
బూని పిలువంగనగుపని
నానతినిడు మేమిసేతుమయ్య మహేశా. 198

క. అనవిని మునిజనవినుతుఁడు
తనమనమున ఘనతసల్పి తన్మునులకతం
డను తలపూవగు రేదొర
తునుక వెలుగు లేతనగవుతో బొందుపడన్. 199

వ. మునులార! మూ_ర్త్యష్టకవిశిష్టుండనైన నాకు స్వార్థపరంబులగు ప్రవృ_త్తంబు లప్రవృ_త్తంబులేకదా అయినను దృష్ణాతురంబులగు చాతకంబు లంబుదంబునట్టు లరిపీరాప హృత పారిజ్యరాజ్యలగు నిజ్యాహావిర్భోజ్యులు సురజ్యేష్ఠోపది ష్టులై పరిసూత్యర్థమర్థించిరిగాన దేవముఖునావిర్భావంబునకు యజమానుం డరణింబోలె నాహైమవతి నాహరింప నిచ్చ్చజ

నించె. నస్మద్ధర్మంబు సార్థకంబుగా తమరా హిమశైలపతిని యాచింపఁగావలయు. సత్పురుష ప్రతిపాదిత సంబంధములు వైకల్యోత్పాదనంబునకు సమర్థంబులుగావుగదా. అత్యున్న తుండునుసుప్రసిద్ధుండునువిశ్వంభరాభారనిర్వాహండునుభూధర సార్వభౌముండునగు నాహిమవంతునితోడ సంబంధంబొనర్చు నన్ను నవంచితునిగా నెఱుంగుఁడీ. భవత్ప్రణీతాచారంబుల సాధుజనులుపదేశించెదరుకాన కన్యార్థం బివ్విధంబున ముచ్చ టింపుఁడని మీకొరులు చెప్పనక్కఱలేదు. పూజ్యయా నీయ రుంధతియు నీవిషయంబున వ్యాపారంబాచరింపనర్హురాలు. తఱచుగనిట్టిపనులయందుఁబురంధ్రులకుఁబ్రాగల్భ్యమెక్కుఁడు

తే. గీ, కాన మునులార! వెడలుఁడు కార్యపరతఁ
బర్వతాధిపు నోషధిప్రస్థపురము
నిమ్మహాకోశికా ప్రపాతమ్మునందు
మనకు సంగమమగుఁగాక మగిడియనఁగ. 201

ఉ. యోగులకగ్రగణ్యుఁడగునుగ్రువివాహసమున్ముఖత్వమున్
రాగమునం గనుంగొనెడి బ్రహ్మమునుల్ స్వపరిగ్రహప్రతా
నాగతమా నపత్రప ననంతరమే విడనాడి రట్లయా
నోగులు బాగులాజగతి నుత్తములేపథ మాశ్రయించిరన్.

తే. గీ. పరమమని మునిమండల మరుసమెనసి
యపుడె హిమగిరిదరికిఁ బ్రయాణమయ్యె

మొదటఁదానన్న సంకేతభూమిఁ జెందె
నెలమిమిగుల ననంతరం బిందుధరుఁడు. 203

శా. శ్రీలక్ష్మీ నరసింహాభవ్యకరుణాచింత్య ప్రభావాప్త వి
ద్యాలాభా లసదూర్ధ్వపుండ్రకలితాస్యాంభోజ రాజాభిమా
నాలంకార కరిప్రధాన వరదాంఘ్రిబ్జార్చనాధీన గో
పాలాచార్యతనూభవా భవభయధ్వంసాధ్వనిత్యంచరా. 204

మంగమాంబాధవా మంజులప్రాభవా
రంగపూజాపరా రమ్యకీర్త్యంబరా
మంగళైకాశ్రియా మాన్యకావ్యప్రియా
యింగితాభిజ్ఞ సాహిత్యరత్నాకరా. 205

క. శ్రీవేదశిఖరినృహరి కృ
పావిభవ సమాప్తభవ్యపాండిత్యధనా
దేవగురూపమధీబల
క్ష్మావిబుధసమాదరణ వికస్వరహృదయా. 206

గద్య:—ఇది శ్రీమదబ్బాలా త్రిపురసుందరీ ప్రసాదాసాదితాన
వద్యకవితామోగహృద్య భారద్వాజగోత్రపవిత్ర మహి
తాపస్తంబసూత్ర లక్ష్మీనారాయణయజ్వపుత్ర గురు
జనాశీర్వచనపాత్ర విజ్ఞజనవిధేయ యజ్ఞనారాయణ
నామధేయప్రణీతంబగు కుమారవిజయ
ప్రబంధంబున ద్వితీయాశ్వాసము

# కుమారవిజయము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీమహిత హితకులీన
స్తోమ మనస్విజనవర్య శోభితనిఖిల
క్షేమ కొమాండూర్వేంకట
రామానుజనామధేయ ప్రాజ్ఞవిధేయా

వ. ఆకర్ణింపుము.

ఉ. ఆమునిమాననీయులు మహామహు లాదటఁదుష్టిమై నసి
శ్యామలమైన నాకసమునందనిలంబు మనంబుమించు ను
ద్దామగతి ప్రవాహమునఁ దత్పురవర్యముఁజేరఁబారి స్వ
ర్గామిత కామనాకృతి నిజాత్మలనెంచిరి వంచనంబుగన్.

వ. అయ్యెడ నొయ్యన వసుసంపదలకు వసతియగు నలక కొలఁతలమర స్వర్గాభిష్యందవమనం బొనర్చిరచియింపఁ బడినట్లొప్పునదియు, గంగాస్రోతః పరిఘాపరీతంబై యంతర్జ్వలదోషధికంబగు విస్తారమాణిక్యమయప్రాకారంబుచేత సంవరణ ప్రదేశంబునఁ గూడ నతిమనోహారంబగునదియు, సింగంపుగములన నంతరంగంబుల బెంగఁగొనని నాగరనాగపూగంబులచేతను బిలసంభవంబులై విరాజిల్లు వాజిరాజంబులచేతను పౌరులగు యక్షకింపురుషాదులచేతను బురంధ్రిమతల్లికలగు

వనదేవతలచేత ననన్యసామాన్యవైభవంబు నెనయునదియు, నికేతన విమానాగ్రి జాగ్రద్ఘనాఘన నివహానుగర్జిత సంజి గ్ధస్నిగ్ధమురజ నిర్ఘోషవ్యక్తీకరణ చణకరణ సంస్ఫీతంబును, నానా నల్పకల్ప విటపిపిటపవిలోలచేలాంచల కల్పితానంత వైజయంతీసందోహ సముపేతంబును, శుద్ధస్ఫటికోపల నిర్మిత హర్మ్యాగ్రిపాన భాగభాగమల తారకావార ఛాయాపూరి త ప్రసవోపహార సౌభాగ్యంబును, దుర్దినయామినీసమయ సంచర దభిసారికావర్గ ప్రదర్శిత మార్గవివిధౌషధీ లతావితా న ప్రకాశసంపదనభిజ్ఞాత తామసంబును, యౌవనము పైని వయస్సును గుసుమాయుధునికన్న వేరగు నంతకుండును రతి ఖేదసముత్పన్నమగు నిద్రకుమిక్కిలి చేతనాపగమంబు నెఱుంగ క భ్రూభంగయుక్తంబులు సకంపాధరంబులు లలితాంగుళి తర్జ నంబులునగు ప్రమదలప్రణయకలహముల చేతమాత్రమాప్రసా దము యాచకీక్రియమాణులగు రమణుల రామణీయంబున కా లవాలంబును,సంతానానోకహనివహ ఛాయాంచితతల సుప్తవి ద్యాధరాధ్వనీన గంధమాదన కల్పితోపవనంబునగు నప్పురం బుడంబునాలోకించివచ్చుచు నున్ముఖద్వారపాలకావలోక్య మానానూన తేజోనిబిడ నిజదేహభారులగుచు లిఖితానల ని శ్చలంబులగు జటాభారంబులతో వేవేగ నగ్గిరిరాడునింట మిం టినుండి యవతరించెడి యథావృద్ధపురస్సరంబగు నమ్మునిప రంపర తోయా తర్భాసకర్శాళిఁబోలి దర్శనీయంబగుటయు

ఆ. వె. అద్రినాథుఁడంత సర్ఘ్యల సర్ఘ్యంబు
తోడ దూరమం డెదుర్కొనంగ
సారగురువులౌ నిజపదవిన్యాసము
ల్బడమి నద్రువఁ జేయఁబోయెఁ బ్రీతి 4

తే. గీ. ధాతుతామ్రాధరుఁడు దేవదారుభూరి
భుజుఁడు బ్రస్తరవక్షుఁడై పొడవుఁగనుట
హిమమహీధరమని స్వభావముఁదోచు
నతఁడు వారికిఁదగు నర్చలాచరించి. 5

తే. గీ. తాన మార్గంబుఁజూపుచు ధవళచరితు
లైనవారల శుద్ధాంతమందుఁజేర్చి
వారుకూర్చుండఁ గూర్చుండి ధారుణీధ్ర
వరుఁడు ప్రాంజలియై మునీశ్వరులకనియె. 6

తే. గీ. అపఘనోదయమగు వర్షమ ట్లదృష్ట
కుసుమమగునట్టి ఫలముమట్లు లెసక మెసఁగె
దివ్యమునులార! మీరిట్లు తెలియకుండ
నాస్మద గృహంబునకు వచ్చు టరసిచూడ. 7

ఆ. వె. మున్ను మూఢమయ్యు బుద్ధమైనట్టులు
నాయసంబు హైమమైనరీతి
భూమినుండి స్వర్గభూ కెక్కినమాడ్కి
మీయనుగ్రహమున మేలుఁగంటి. 8

ఆ. వె. ఇంతనుండిసకల జంతు సంతతులకు
ప్రాప్యుఁడయ్యె శుద్ధిఁబడయ నితఁడు
హేతువెడలి పెద్దలెద్దానికింగూర్తు
రదియ తీర్థమందు రార్యజనులు. 9

క. పూతుఁడనైతిని రెంటనుఁ
జేతోముదమయ్యె నాకు శిరమునగంగా
స్రోతస్స్వినిసీట భవ
ద్ధౌతాంఘ్రిపయః కణాళిఁదాపసులారా! 10

తే. గీ. తమకుదాసత్వమెనసి జంగమము యుష్మ
దంఘ్రివిన్యాసమునఁ జేసి స్థావరంబు
రెండు తెఱఁగుల నామేను వృద్ధినెసనె
భవదనుగ్రహమిట్లు విభక్తమగుట. 11

తే. గీ. అమలతేజస్కులార! నాయువయువములు
వ్యాప్తదిగంతరంబు లగ్గైనఁ జాల
నయ్యె మీకూర్చినట్టి మర్యాదఁ బొడమి
యడరుచున్నట్టి పరితోష మమరఁదాల్ప. 12

తే. గీ. మానివరులార! భూరితేజోనిధాను
లైన మీదర్శనంబున నణిగె గుహలఁ
దామసంబెట్లు లట్టు లంతర్గతంబు
రాజసపరంబు తమము నిరస్తమయ్యె. 13

6

తే. గీ. కార్యమునుమీకు నెఱుఁగ నాకాంక్షయున్న
స్మరణమాత్రంబునం బొందఁ జాలరెట్లు?
లరయ నేను పవిత్రుఁడనగుట కొఱకె
యిట్టు లేతెంచినారని యెదఁ దలంతు 14

తే. గీ. అయిన నేదేనికార్యంబునందు మీర
లర్హులరు కాన నాకిప్పు డాజ్ఞనిడుఁడు
ప్రేషణానుగ్రహులుకారె? భృత్యులెపుడు
వితతమతులార యాప్రభవిష్ణులయెడ. 15

తే. గీ. దేవి యిది యిది మాకులజీవితంబు
కూఁతు రీవేను మీకెద్ది కూర్పవలయు
నన్యవస్తువులందు ననాస్థ మాకు
లేదు మీకిడరానిది లేశమైన. 16

మ. అని దర్యాస్యభవ ప్రతిస్వనముచే నాత్మేరితంబుల్ ద్విరు
క్తినిగాఁజేయుచుఁ బల్కుభూధ్రపతివాగ్విస్ఫూర్తికిన్మెచ్చియా
ఘనమానుల్దమవచ్చినట్టిపని వక్కాణింపఁగా నంగిరో
ముని గాథాకథనప్రవీణమతి సంబోధించెఁ చ్ఛాగతిన్. 17

శా. ఆతం డిట్లను నీతకెక్కుఁడుగ నీయందర్హమానిద్ది నీ
చేతశ్శృంగసమున్నతుల్సుమములో సిద్ధాంతమో భూమిభృ
న్నేతా! విష్ణునిస్థావరాకృతిగ నిన్ జెప్పంబురాణంబు లా
భూతౌఘంబుల కాత్మకుక్షి నెల వౌపున్నెంబు లెక్కింపుచున్.

కం. ఆపాతాళంబుగ నీ
వాపక యున్నట్టులైన నాశీవిషరా
జోపు నె? నిజమృదుఫణముల
నీపరమంబైన భర మహీనగుణాఢ్యా! 19

తే. గీ. అమలసంతానముల నెల్ల నవధరించి
పెద్దసంద్రింపు తెరగల హద్దు లేక
భువనముల నెల్లఁ బొనరిచెఁ బూతములుగ
నీదుకీర్తులు నదు లనిందిత చరిత్ర! 20

చం. హరిచరణాంబుచేత నెటులందెను శ్లాఘ్యతగంగయట్టులు
చ్ఛిరసుఁడవైన నీవు జనిఁ జెందఁగ రెండవహేతువౌటఁ జే
కురె నదిదాని, కెల్లెడలఁ గౌన్నతి త్రివిక్రమశౌరి గౌరవం
బరుదిపుడయ్యెఁబో సహజమయ్యది నీకు ధరాధరోత్తమా!

తే. గీ. సవనభాగంబుఁ గొనువారి సరసఁ బదము
నందు నీచే హిరణ్మయ మతిసమున్న
తంబగు సుమేరుశృంగంబు ధరవరేణ్యా!
వ్యర్థముగఁ జేయఁబడియె నవార్యలీల. 22

మ. స్థిరమందుం గఠినత్వమున్నిలిపి సత్సేవార్థమై భక్తిబం
ధురమౌ నీతనువు న్విధించితివి సాధుం డంచస న్నివ భూ
ధర! మా వచ్చినకార్యమీవువినుమర్థంబద్దియున్నిదమే
మరయంగా నిట నంశభాజులము శ్రేయఃప్రాప్తిని జెప్పటన్.

సీ. అణిమాది గుణయుతం బస్పృష్టపురుషాంత
రంబును సార్ధచంద్రింబునైన
యీశ్వరశబ్దంబు నెవ్వఁడు భరించుఁ
గల్పితానోన్య సాకల్యములగు
భూమ్యాదిమూర్తుల భువనాళిఁ బథి నశ్వ
ములు రథమ్మును బోలెఁ బూసియుండు
నెవ్వఁడు యెవఁడు యోగీంద్రులచేత క్షే
త్రాంతరవర్తియై యరయఁబడును
తే. గీ. పదముదేని ననావృత్తి భయ మనెదరు
దాని యధిపతియును జగత్కర్మసాక్షి
వరదుఁ డెవఁ డాశివుండు వివాహమాడఁ
గోరుచున్నాఁడు నీపుత్రి గోత్రరాజ! 24

తే. గీ. కాన నాశంభు నర్థము వ్వాణితోడఁ
బోలె సుతతోడ యోజింపఁ జాల లెస్స
యుర్వి నుర్వీధరాధిప! యోగ్యభర్త
నరసి యొసఁగిన సుత శోచ్యయగునె చెప్పుమ. 25

తే. గీ. క్ష్మాధరేశ్వర! జంగమస్థావరంబు
లెన్ని భూతంబులుండు నయ్యెల్లభూత
ములకుఁ దల్లినిఁ జేయుము పుత్రి నఖిల
జగములకుఁ దండ్రికాఁడె యాచంద్రధరుఁడు. 26

క. ఈతరుణి పెండ్లికూఁతురు
దాతవునీ వరయ యాచితలమేము హరుం
డేతత్ప్రతి గ్రహీతయు
నూతంబయ్యె విధి త్వత్కులోద్భూతికినై. 27

తే. గీ. స్తూయమానుండు ననితర స్తోతయైన
వాఁడు వంద్యుండు ననితరవంది యైన
విశ్వగురునకుఁ గురువ వుర్వీధరేంద్ర!
నిజసుతా దాననిధిచేత నిక్కమగుము. 28

క. ఈలాగున మునివర్యుఁడు
ప్రాలేయాచలునితోడఁ బలుకుచు నుండం
బాలామణి తలవాలిచి
లీలాంబుజదళము లెలమి లెక్కిడుచుండెన్. 29

తే. గీ. భూమిధరరాజు సంపూర్ణ కాముఁ డయ్యె
మేనమోమున నునిచెను తానుచూపుఁ
దఱచుగాఁ గన్యకార్థవితతిఁ గుటుంబి
జనము గృహిణీవిలోచన మనఁదగుఁ గద. 30

క. మేనాదేవియు నఖిల
ప్రాణేశేష్టార్థమునకుఁ బరితోషించెన్
ప్రాణేశేష్టంబుల నతు
లేనాఁడును వ్యభిచరింతురే? తలఁపోయన్. 31

తే. గీ. అచలవిభుఁడును మౌనివాక్యావసాన
మున నిదియ న్యాయ్యమని మనమునఁ దలంచి
మహిత మంగళ మండన మండితాంగిఁ
దీసుకొనివచ్చె నప్పుఁ డాత్మీయసుతను. 32

తే. గీ. అమ్మ! రావమ్మ పిశ్వాత్మ్మ(?)కైన హరున
కైతి విప్పుడు భిక్షగా నా తెరంగుఁ
దెలుపవచ్చిరి వీరలే దివ్యమునులు
పడయఁ గంటెని గార్హస్థ్యఫలము నేఁడు. 33

క. అనిపలికి యిట్టు లాతం
డను నమ్మునివరులఁగాంచి యాదరమున వం
దనము నొనర్చెడిని త్రిలో
చనవధువునటంచుఁ గొనుఁడు సంయములారా!

తే. గీ. ఈప్సితార్థకరీయోదార మిష్టమైన
యాతని వాక్యంబు నెంతయు నాదరించి
పరమమునులు పురస్కృత ఫలములైన
దీవనల నంబికకిడి రుదీర్ణులగుచు. 35

క. నమనాదర విస్రింస
న్నమలిన కనకావతంస నగసుత లజ్జా
నమనముఖి నయ్యరుంధతి
తమ యంకమునందు నునిచి తగ లాలించెన్. 36

తే. గీ. పట్టిపైనున్న ప్రేమంపు భరమువలన
నశ్రుముఖియైన మేనక నామె కడు న
నన్యపూర్వుఁడగు వరు గుణాళి నొడివి
విగతశోకనుగాఁ దపస్విని యొనరిచె. 37

క. నేటికి నాల్గవదినమునఁ
బాటిలు సుముహూర్తమనుచుఁ బర్వతవిభుతోఁ
దేటపడఁ బలికి యాముని
కోటి కదలె నంత హరుని గూడఁగఁ బ్రీతిన్. 38

తే. గీ. ధరవరుని వీడుకొని పురహరుని మరల
చేరి, తమపోయివచ్చిన కారియంబు
సార్థకంబాటఁజెప్పి చంద్రార్ధమౌళి
యాన మిన్నునకెగసి వారరిగిరంత. 39

తే. గీ. ఈశుఁ డమ్మూఁడుపవళ్లు లెట్లెట్లొ గడపె
శైలపుత్రికన్యా సమాగమోత్కంఠచేత
విభుఁడయినవాని నంటెను వేరచెప్ప
వలెనె యన్యావశుని నంటు భావములని. 40

తే. గీ. అంతట వలక్షపక్షంబునందు నల్ల
తిథియు జామిత్రిగుణమునఁ దేజరిల్ల
బంధుగులఁగూడి యాహిమవంతుఁ డాత్మ
పుత్రికి వివాహదీక్షను బొసఁగఁజేసె. 41

తే. గీ. తదనురాగంబునం బ్రతిసదనమందుఁ
పాణిపీడన కౌతుకాపనయమంచు
వ్యగ్రలైన పురంధ్రుల నలరెఁ బురము
నంతిపుర మొక్కఁడౌ కులమనఁగఁదగుచు. 42

సీ. మందారపూర్వ సుమ స్తోమకీర్ణత
రహియించు రాజమార్గములతోడఁ
గెంబట్టుపుట్టంబు డంబున రవణిల్లు
తుంగంబులైన కేతువులతోడ
తలుచుగాఁ జలువపందిరులకుం గట్టిన
నవరత్నమయ తోరణములతోడ
వైవాహకౌతుకోపాదాన సంపూర్ణ
పౌరహాటక సౌధ పాళితోడ

తే. గీ. నమ్మహీధర వరుని పురమ్ము వొలిచె
నౌర స్థానాంతరస్థమానమర రాజ
పట్టణవరేణ్యమనుచుఁ జూపరులకెల్ల
భావములయందు వెక్కసపాటు కలుగ. 43

తే. గీ. కొమరులు కొమార్తె లుండియు క్షోణిధరప
తికిని మేనకుఁ జిరకాలదృష్టవోలె
మృతసముత్పన్నతవోలె నాహితవివాహ
యనెడు తలఁపున నసుకల్పయయ్యె గౌరి. 44

తే. గీ. అంకతలమునసుండి వేరంకమందె
దీవనల మండనంబులఁ దావడయుచు
విదుత్రిమాధరి, సంబంధి భిన్నమయిన
గిరికులస్నేహ మామె నికేతనముగ. 45

తే. గీ. ఉత్పలాక్షికిఁ మైత్రముహూర్తమందు
హిమరుగుత్తర ఫల్గునీభములు పొగ
మందఁ బ్రీతికర్మఁ జేసిరి బంధుగులొగి
వారు పతిపుత్రిసహితలు కారె? తలఁప. 46

తే. గీ. తరళలోచన గౌరసిద్ధార్థఘటిత
విమలదూర్వాంకుర ప్రతిభిన్నశోభ
సశరనిర్నాభి కౌశేయ సరణి యైన
యట్టి యభ్యంగనేపథ్య మవధరించె. 47

సీ లోధ్రికల్కమున నలుంగునుంబెట్టి యా
శ్యానకాలేయకృతాంగరాగఁ
బొనరించి తగువస్త్రమును ధరింపఁగఁ జేసి
యభిషేకమున కర్హమౌ చతుష్క
మందిరంబునకు రామను దోడుకొనిపోయి
విన్యస్త వైడూర్యము న్యబద్ధ
ముక్తాఫలమగు నాభూమి మంగళతూర్య
ము లమందగతిమోగ్రియ భూధరేంద్రి

తే. గీ. తనయ కావర్జితాష్టాపదమయకుంభ
వారిధారాసహస్రము లీమ్మరఁగా వ
గాహ మొనరించి రా బంధుకామినులొగి
స్నేహమును కూర్మి భూరిసన్నాహ మొప్ప. 48

తే. గీ. మంగళస్నానశుద్ధాఖిలాంగియున్ గృ
హీతపలిధౌతవస్త్రమై యింతి యొప్పెఁ
జెంది పర్జన్యసలిలాభిషేకముం బ్రి
ఫుల్లకాశాలిచేనొప్పు భూమివోలె. 49

వ. ఆవిధంబున నాయిభరాజగమన నభినవ శాత
కుంభ కుంభాచ్ఛావిచ్ఛి న్నాంబుధారల నభిషేకంబాచరించి
కొందఱు సుందరీమణులు వివిధమణిగణఖచిత విచిత్ర జాం
బూనదస్తంభ సౌందర్య సంభార సంభావితంబును శరదవసర
నీహారావరణ సంకాశ వితత నూతన వితాన సమావృతంబును
గ్లప్తాసనంబునగు కౌతుకవేది మధ్యంబునకుఁదోడ్కొనిపోయి
తత్ప్రదేశంబున. 50

చ. తొలిదెసమోముగా సతులు తొయ్యలినిం గనకంబుపీటపై
నిలిపి యలంకరించుటకు నేరుపుకూరుపఁదంద్ర నట్టులే
నలినదలాక్షులుండిరి మనంబుల నంబుజగంధి యందమున్
నిలిపి ముహూర్తకాలమును నిశ్చలతా వశగాంతరంగలై. 51

క. అంతట నరాళకుంతల
కుంతలములయార్ద్రతను జకోరాక్షి యొక

త్రంతము సందఁగఁజేసెను
స్వాంతహరంబైన ధూపసంతానముచేఁ.

తే. గీ. బర్హిబర్హాంబుకంబెను భవ్యమైన
సారసదళాక్షి కేశపాశంబునపుడు
దూర్వచేనొప్పు నవ్యమధూకమాల
చేత బంధించె నొక్కతె చెన్నుమిగుల. 52

తే. గీ. రుచిరవిరచిత శుక్లాగురును సురభిళ
నవ్యగోరోచనా రచనావిభక్త
మొనరుపఁగ మేనిఁ జక్కవలున్న పులిన
ములుగల సురాపగనుమించి పొలిచె గౌరి. 53

క. చెలివేరొకతె సుజాతో
త్పల దళకాంతంబులైన పార్వతికనులం
దిలకించి ముదితయై మం
గళమనుచు నలంకరించెఁ గాలాంజనముఁ. 54

క. నలినవిలోచన యొక్కతె
లలనామణి చెక్కిలి న్విలాసముతో మా
చెలి పెండ్లికూఁతురయ్యెను
కలిగె మహాన్మనుచు నునిచెఁ గాటుకబొట్టుఁ. 55

చ. ఒకతె నగేంద్రపుత్రి పదయుగ్మమునందు ననూనమైన ల
త్తుకనిడి మోమున న్నగవుతోఁపఁగ నీచరణంబుతోడ నీ

సకుఁడు శిరంబునందిడెడి చందురునంటుమటంచుఁబల్కి నం
బిక మరుమాటపల్కకయమీఁదెను మాల్యమునన్నభీమణీ.

తే. గీ. అతివచెవిలోననున్న యవాంకురంబు
లోధ్రసుకషాయరూక్ష గోరోచనాతి
గౌరగండస్థలీ పరకాంతిలాభ
పరత హరియించెఁ గన్గొనువారి కనుల. 57

క. సొమ్ములఁ దాలిచి యొప్పెను
కొమ్మపువులనొప్పెడి లతకూనను నక్ష
త్రిమ్ములఁజెలఁగు నిశ విహం
గమ్ములనలరు నది మించి కరమధికంబై. 58

మ. తనయందంబును జంద్రబింబముఖి హస్తాదర్శబింబంబునం
గనులారం దిలకించి మించుపులక ల్గాత్రంబునందొప్పఁగా
నను వేళంబు హరోపయానమున నత్యంతత్వరాయుక్తయ
య్యెను చింతింపఁబ్రియావలోకనఫలం బేకాదె? శ్రీవేషమున్.

సీ. విమలమాడిండీరసముదయంబున నొప్పు
పాలసంద్రపువేల పాలుగాక
పరిపూర్ణ శశిబింబధరమైన యాశర
దవసరనిశకైన నందరాక
పుండరీకంబుచేఁ బొలుపారు వారిజా
తాకరలక్ష్మి యర్హాయనుకాక

యుత్ఫుల్లమంజరి నొప్పమీఱెడి వల్లి
కకు నాకధాపరిసంగమును లేక.

తే. గీ. యాత్మబింబంబుఁ గాంచంగ నాళియిచ్చు
డంబుమీఱెడి మించుటద్దంబుఁ బూని
చూచువారల కన్నులఁ జూరగొనెడి
మానినింబొందెఁ గాంత్యభిమానలక్ష్మి. 60

సీ. కారఁయితవ్యాళిఁ గఱుదక్షయగు మేన
హరితాల మొకవేలి నమర మఱియొ
కంట మనశ్శిల కాలిఁగ సుతఁజేరి
శోణితరిసంసక్తవిశుద్ధదంత
పత్రిమైనట్టి దద్వక్త్రింబుఁ బయికెత్తి
యను కుచోద్భేదమత్యంతవృద్ధి
నందె నెయ్యది పట్టి కట్టికొర్కెను బెండ్లి
బొట్టుఁగారచియించి మోమునందు

తే. గీ. నక్షులు ముదంబుఁ గుఱియఁగ హస్తమునకు
సొర్ణమగునట్టి కౌతుకహస్తసూత్రి
మును బడాంతరమంబుఁ దా ముడిచె ధాత్రి
సరిగ వేళులు సవరింప జలజముఖికి. 61

తే. గీ. పూజసల్పిన యింటివేల్పులకు వరుస
వందనంబును జేయించి పరమభక్తి

పరత ముత్తైదువుల పాదపద్మములకు
నమనము లొనర్పఁ జేసె నారమణిచేత. 62

తే. గీ. అక్షతంబగు ధవుకూర్మి నందుమనుచు
పలుకఁబడె నుమ యాపురంధ్రులవలన హా
రార్ధకాయంబునందిన యాను చేసె
బందుగుల దీవనలనెల్ల మందములుగ. 63

వ. అట్టు లబ్భూధరసార్వభౌముండు కూఁతునకు విభూతిచ్ఛానుసారంబుగఁ బరిసాధనవిధానంబు నిర్వర్తింపఁజేసి సకల బంధు పరివృతుండై వృషకేతనాగమనప్రతీక్షుండై యుండ నక్కైలాసపర్వతంబున సప్తమాతృకలు మహేశ్వరు నగ్రభాగంబునఁ బరిసాధనసామగ్రినునిచిన నాతఁడు నమ్మంగళ మండనసంపదఁ దద్గారవంబునఁ గరస్పర్శంబున నంగీకరించి కించిన్నిమీలిత నయనుండై హృదయపద్మంబున నప్పద్మబాంధవకోటి ప్రకాశుండు నిజవేషంబుఁ బరిణామంబుకాఁ దలంచిన. 64

సీ. పొలుపుగఁ దనమేనఁ బూసిన వెలిబూదె
రహిమించు లలితాంగ రాగమయ్యె
నాదలధరియించు నా కపాలంబును
మణిగణాంచిత భర్మమకుటమయ్యె
శోణిత లవము లంచులనుండు గజచర్మ
లలితనూతన దుకూలంబునయ్యె

శంఖాంతరంబునఁ జరియుచు నయనంబు
దివ్యకస్తూరికా తిలకమయ్యె

తే. గీ. నొనర నాయూతలంబు ల నునిచినట్టి
భుజగవరులు ఫణారత్నములను వీడి
స్వర్ణకంకణములయి కన్పట్టె హరుఁడు
మనమునఁదలంచుమాత్రిఁ దక్షణమునంను. 65

క. పగలుం గాంతులఁ జిమ్మచు
నగపడనీ కంకమును మహాబాల్యమున
న్నిగనొప్పుచందురిఁ డుండఁగ
మగిడీ ధరింపంగనేల? మఱియొండు మణిన్. 66

వ. అవ్విధంబున నధ్భుతైక ప్రిభవుండగు నభ్భవుండు నిజప్రిభావంబున నైపథ్యవిధి నవధరించి యాచారమాత్రింబున నాసన్నగణోప నీతంబగు ఖడ్గంబున నాత్మబింబం బుపలక్షించి నందికేశ్వర భుజావలంబుఁడై యాస్తంబేరమ చర్మాంబరుండు శార్దూల చర్మాంతరిత పృష్ఠభాగంబును భక్తిభారసంకుచిత విశేషంబునగు వృషరాజంబు రాజతగిరి నట్టులధిష్ఠించి పర్వత రాజపట్టణాభిముఖుండై పయనంబయ్యె నయ్యవసరంబున. 67

తే. గీ. దేవువెన్నంటి సప్తమాతృకలు నడచి
రాత్మయాన చలనచలితావతంస
లయి ప్రిభామండలారుణాస్యముల మిన్ను
పంకజాకర భూరిశోభాంకితముగ. 68

ఆ. వె. స్వర్ణవర్ణలైన సప్తమాతృకలకు
వెనుక నడచెఁ గాళి విపుల సిత క
పాలముల ధరించి పరివేష్టితబలాక
మెఱుఁగు లెమరవైచు మేఘమాల. 69

సీ. భయసంభ్రమములొప్పఁ బద్మనాభుఁడురాఁగ
నాచానురాగంబు గోచరించె
సృష్టరాఁ దనభక్తిఁజాటుచుఁ దద్గార
వను నుత్తమాంగ కంపమునఁ దెలిపె
వృత్రాసురారిరా విశ్వాసముంటను
వదనస్మితముచేసె విదితతరము
నంజలుల్ ఘటియించి యమరులెల్లరురాఁగ
నాలోకమునఁదెల్పె నాదరంబుఁ

తే. గీ. దక్కుఁగల దేవయోనులు తరలివచ్చి
రనుచునంబీశ్వరుఁడుచెప్ప నాలకించె
నిట్టులాదేవగణములో నెల్లరకును
భవునివలనం బ్రశస్తియాభంగిఁ జరిగె. 70

మత్తకోకిల. నేతకప్పుకు విశ్వకర్మవినిర్మితంబు నవంబునా
నాతపత్రముఁబట్టె నాకమలాప్తుఁడెంతయుభక్తిమై
యాతఁడున్నివములాతపత్రి పటాంతిక స్వకమాళియై
చేతమఃల్దనియించె నదిశశి శీర్షమందు ననంగనై.

తే. గీ మూర్తిఁగొనివచ్చి గంగ యమునయు నీను
వీవసలచేత నోలి సేవించుకొనిరి
వారినిధిగా స్వరూపవిపర్యయంబు
కలిగియును హంసపాతము ల్గలవినొ యన. 71

క. ప్రిథమవిధాతయు విష్ణుఁడు
విధుఖండవతంసు నపుడు వివిధజయవచః
ప్రథమానమహిముగ నుష
ర్బుధు హవ్యముతోడఁ బోలెఁబొనరిచిరి తమిన్.

తే. గీ ఒక్కమూర్తియ మూఁడుగ నొప్పుచుండు
నరయ సామాన్యమౌఁ బ్రథమావరతయు
విష్ణునకు హరుఁ డతనికి విష్ణు వొకపు
డిద్దరకు ధాత ధాత కయ్యిద్ద రినులు. 73

తే. గీ. అపుడు సప్తర్షులంగాంచి యనియెనిట్లు
భవుఁడు ప్రీతి వివాహ సవనమునందు
మీర లధ్వర్యులుగనుండ మేలునాకుఁ
బూర్వవృతులునుగాన నోపూజ్యులార! 74

వ. అని వారల నప్పనినెరవేర్ప నొప్పించి ప్రవీణ
విశ్వావసుప్రముఖసంతతసంగీయమానవిజపురాపదానసంశ్రవణ
సంజాతపులకాంకుర భరితశరీరుండై తమోవికారానతిక్రమణీ
యుండగు నా శశాంకార్ధవిభూషణుండు నిజకంధరామూల

బద్ధకాంచనకింకిణీగణశబ్దశబ్దాయమానదిశారాజియగు వృషభ రాజంబు తన్నువహింప మార్గంబుఁగడచినంత. 75

తే. గీ. అద్రిగుప్తం బనాత్త పరాభియోగ
మోషధిప్రస్థ పురము నిమేషమునకుఁ
జేరెను పురోగ శూలిదృష్టిప్రపాత
హైమసూత్ర వికృష్టమం చనఁగ వృషము. 76

వ. అట్లు సమీపించి యానీలకంఠుండు తత్పురోప కంఠంబున నిజయానంబుడిగ్గి యున్నంత. 77

తే. గీ. వృద్ధి మద్బంధుబృంద సంబద్ధములగు
వారణావారములతోడఁ బర్వతేశుఁ
డెదురుకొనియెను శివుని నహీనఫుల్ల
కుసుమ పాదపకటకముల్గొల్వనునఁగ. 78

తే. స్వర్గిభూభృత్పరస్పర వర్గములును
సంగతములయ్యెఁ బూర్వహిస్థలమునందు
మోత్రిత దెసలెల్లఁ బ్రసరింప వీతసేతు
వాఃప్రవాహంబు లట్టులవార్యలీల. 79

వ. అట్టు లెదుర్కొనిన నాహిమవంతునకు నయ్యీశ్వ రుండు సర్వేశ్వరుండయ్యు నమస్కరించిన నయ్యుర్వీధర సార్వ భౌముం డుత్కంఠాతిశయంబునఁ దొల్లితదనుభావాతిశయం బున నిజమూర్థంబు నమ్రత్వంబు నందిన తెఱం గెఱుంగనివాఁడు

కావున నా శ్రీమంతుండు హీమంతుండై. 80

శా. ఆనందాంబుధి నోలలాడ నెద నీహారాచలుం డల్లనిం
బౌనఃపున్యముగాఁ జూచుచుఁ బురోభాగంబునందుండి నా
నానూనప్రసవావకీర్ణ ఘనపణ్యాధ్వంబు నాపోరిలునుం
దానెంతేనియుఁ బ్రీతిఁదోడుకొనిరాఁ దద్రాజమార్గంబునన్.

తే. గీ. అమ్ముహూర్తంబునందు హారావలోక
లాలసలగుఁ బురయువతులకు విచేష్టి
తంబు లీలీలఁ బ్రాసాదతతులయందు
జరిగె ద్వ్యక్తేతరప్రయోజనములగుచు. 82

శా. ఆలోకాధ్వముఁ జేరఁబోవు నొక కంజాక్షీలలామంబు త
త్ప్రాలేయాంశుకలావతంసుని గనం బర్వెత్తు వేగంబునన్
లోలంబౌ జడనుండిజారు సరమున్ లోలాక్షిబంధింప న
వ్వేళంజేకొనియుం దలంపమతదా ప్తింజెందు పర్యంతమున్. 83

ఉ. త్ర్యంబకుఁ డేగుదేరఁగ నితంబినియొక్కతె తత్ప్రసాధికా
లంబితమగ్రపాదమును లాక్షసహార్ద్రమునైనదాని వే
గంబుతలిర్ప లాగికొని కాంతు గవాక్షముఁజేరుదాక మా
ర్గంబు నలక్తకాంకితముఁగా నొనరించె నతిత్వరాఢ్యయై.

ఉ. కాటుక దక్షిణంబయిన గంట మనోజ్ఞముగాధరించియున్
హాటకగాత్రియొక్కతె తదంజన వంచితవామనేత్రయై
నీటునుఁబీడి యుత్కమగు నెమ్మది జాలపథంబుఁజేరె లా
లాటవిలోచనుంగన శలాకఁగరంబునఁదాల్చి చెచ్చెరన్.

తే. గీ. చూపులు గవాక్షమధ్యంబుఁ జొరఁగ గమన
భిన్ననీవిని ముడువక కన్నెయొత్తు
నాభిఁజొరఁబారు తొడవుల శోభకలుగు
హస్తమునఁ జీరఁదాల్చి తా నట్లనిలచె. 86

తే. గీ. సత్వరోత్థిత యానొక జలజముఖికి
సామిసూచిత పదపదస్ఖలితరత్న
రశన యవ్వేళ నంగుష్ఠ లగ్నసూత్రి
మాత్రిశేషమగుచు నతిమాత్రిమొప్పె. 87

ఉ. సాంద్రికుతూహలంబున నిశాకరఖండవతంసుఁ గాంచ ని
స్తంద్రితవచ్చుకామినుల చక్షురళిస్ఫురితాననాళి న
దీంద్రపురీగవాక్షములవెంతయునొప్పెనుతత్క్షణంబునన్
సంద్రఁపుఁగూఁతుమన్కిఁ గుమిసల్పినసొమ్ములఁదాల్చెనంచన్

ఆ. వె. ఏకదృశ్యుఁడైన నీశుఁగన్నులఁ గ్రోలు
లలన లొండుపనులఁ దెలియరైరి
సకలకరణవృత్తి సర్వాత్మతనుబొంది
చక్షురింద్రియమున సాగెననఁగ. 89

వ. ఆచందంబున నయ్యిందుశేఖరుండు శేఖరీభూత శశాంకఖండపాండురప్రభామండల మండితప్రాసాద మాలికా విరాజమానంబగు రాజమార్గంబున స్వర్గివర్గంబులతో నేగుదెంచుచుండ నాపశ్యల్లలాటుఁ గవాటమార్గంబువలన నవలోకించుచు నప్పౌరస్త్రైణంబు పరస్పరంబుఁ దమలోన. 90

కం. ఈమిథునము నితరేతర
కామిత శోభంబు నిట్లు కల్పించనిచో
నీమూర్తుల రూపవిధా
నామిత యత్నంబు వ్యర్థమౌఁగద విధికిన్. 91

ఆ. వె. కుపితుఁడై యితండు కుసుమేషు కాయంబు
దగులఁ జేసెననుట తప్పుమాట
వీనిఁజూచి యతఁడు వీతాంగుఁడయ్యెను
దనకుఁదానె లజ్జ ననితలంతు. 92

తే. గీ. అతివ! దైవవశంబుననది ద్రిరాజు
వీని సంబంధముం జెంది పృథివిఁదాల్ప
నుచ్చమైనట్టి మూర్ధంబు నున్నతతర
మైనదానినిఁగాఁగొనియలరుఁగంటె. 93

వ. అనిపలుకు నాలలనామణుల యానందదాయకంబు లగు పలుకులనాలకించుచు నఖ్యేందుకళాధరుండు ముకుంద శతానంద పురందరాది బృందారకబృంద జాంబూనదాంగద సంఘట్టనసంజాత శాతకుంభ పరాగసమ్మిళిత పుణ్యపురంధ్రీ జనతా కరపరిసారిత లాజచూర్ణావకీర్ణాంగణ విభ్రాజితంబగు పర్వతరాజభవనంబుఁ బ్రవేశించి పీతాంబర ససంభ్రమదత్త హస్తావలంబుండై యచ్చరమ్మాంబరుండు శరన్నీరదంబు వలన నీరజ బాంధవుఁడట్లు నిజయానంబుడిగి కమలాసనుం డగ్రేసరుండై

మార్గంబు నిర్దేశింప సకల దేవదేవర్షిసమేతుండై కక్ష్యాంతరం
బులఁ గడచి తత్ప్రదేశంబున విష్టరోపవిష్టుండై నగోపనీతంబగు
నర్ఘ్యంబును మధుమంతంబగు గవ్యంబును నవదుకూలంబుల న
మంత్రవర్జంబుగఁ బరిగ్రహించి దుకూలంబులఁదాల్చి యా
కూలంకషాశిరస్కుండు వినీతావరోధ రక్షులచే వధూసమీప
మందింపఁబడుట స్ఫుటఫేనరాజీ విరాజితుఁడగు నుదన్వంతుండు
ప్రాలేయకిరణ కిరణములచే లీలాసమీప మందింపఁబడిన
చంద బందగించుటయు. 94

తే. గీ. వర్ధమానాననేందు ప్రభయగునట్టి
వధువుతో ఫుల్లచక్షుఃకువలయుఁడుం బ్రి
సన్న చేతస్సలిలుఁడయ్యె శంకరుండు
కలసి శారదవేళఁ లోకంబు పగిది. 95

తే. గీ. అపుడె కలియుటఁగాతర్యమంది కొంత
తిరములై యప్డె మరలు చోండోరులయందు
లోలములగుచు నలరు విలోచనంబు
లాడెను క్షణంబు లజ్జానియంత్రణంబు. 96

తే. గీ. అగగురుప్రాపితంబు దామ్రాంగుళీయుత
మైన యుమ హస్తమునుబట్టె నాశివుండు
తత్తనూగుప్తగాత్రుఁడై తనకు వెఱచు
మరుని పూర్వప్రరోహముం బట్టె ననఁగ. 97

క. రోమోద్గమ మపుడమ్యెను
భూమిధరవరేణ్యసుతకుఁబుంగవవాహుం
డామెంయి స్విన్నతఁదాల్చెను
కానుస్థితి సరిగఁ బంచెఁ గరసంగమునన్. 98

తే. గీ. ఆచరితపాణిపీడనులైన వధువు
వరుఁడు వీరలసాన్నిధ్యవశమువలన
నగ్నికాంతినిఁబోషింతు రనుచుఁ జెప్ప
నట్టితఱి వారికాంతి నేమనఁగవలయు? 99

క. జ్వల దుజ్జ్వలావళియగు
జ్వలనంబునుఁ జుట్టివచ్చు జాయయుఁబతియుం
బొలిచిరి మేరువుఁజుట్టుచుఁ
గలియుచుఁ జరియించునట్టి క్షణద దినము నాఁ.

తే. గీ. సతియుఁబతియుఁ బరస్పరస్పర్శమీఁలి
తాక్షులయి యట్లు ముమ్మారు హవ్యవాహుఁ
జుట్టినంతఁ బురోధ యాసుదతిచేత
లాజహోమంబుఁజేయించె లలితలిప్ప. 101

తే. గీ. గురుసముపదేశమున నిష్టపరిమళమగు
లాజధూమంబునందింప నైజముఖము
నందు గండంబుఁ బ్రాకెడు నట్టికొనలు
కలయది క్షణంబు చెవిలోని కలువ యయ్యె. 102

తే. గీ. ఈషదార్ద్రార్ద్రుణ కపోల మీక్షణోచ్ఛ్వ
సన్మసృణ కజ్జలంబు గ్లామ్యన్మృదుయవ
కర్ణ పూరంబునయ్యె నాత్మాధరాత్మ
జాస్య మాచార ధూమగ్రహణమువలన. 103

మ. అనలంబియ్యది నీవివాహమున సాక్ష్యంబుంగొనుంగాన నో
తనయా ముక్తవిచారవౌచుఁ బతితో ధర్మ్యక్రియాచర్యచే
య నగున్నాఁగఁదదుక్తి సైందర్రము నవంబైనట్టితోయంబుభూ
మి నిదాఘోల్బణతాపచందమునఁగూర్మిన్ గ్రోలెశ్రోత్రాంజలిన్.

మ. ప్రియసందర్శనుఁడున్ ధ్రువుండునగునీప్రేమాస్పదుంగూడిక
న్నియ!నీవాధ్రువుగాంచుమంచు గురువుల్నిర్దేశముంజేయ ము
ద్దియ లజ్జాభరసన్నకంఠియగుచున్ దివ్యాననంబెట్టులో
నయమొప్పంబయికెత్తి కంటిననుచు న్దాఁజెప్పె నవ్వేళకున్.

కం. ఈరహి విజ్ఞపురోధః
కారిత కరపీడనులు జగత్పితరులునా
వారలు నమస్కరించిరి
వారిరుహాసనగతునకు బ్రహ్మకుభక్తిన్. 106

తే. గీ. స్రష్ట కళ్యాణి! వీరప్రసవ వగుమని
వధువు నాశీర్వదించెను, వాగధీశుఁ
డయ్యు నయ్యష్టమూర్తియం దవధరించె
మిగుల నాశాస్య చింతాస్తిమితత నతఁడు. 107

చ. దళగళదంబుబిందుసముదాయహృతోజ్జ్వలమౌక్తికోత్కరా
మలతర శోభమౌచు నతిమాత్రి లస న్నవనాళదండమై
కలితమరందధారమగు గాంచన పంకరుహాత పత్రిముం
గలుములకొమ్మ పట్టె నల గౌరికి నైందవఖండమౌళికిన్. 108

సీ. ముఖమును ప్రతిముఖమ్ముంచు గర్భ మవమర్శ
ముపసంహృతి యనంగ నొప్పుంబంచ
సంధులందు రసానుసారంబుగాఁ గైశి
కీముఖ్య వృత్తులఁగీలుకొలిపి
యయ్యయి రసముల కనుగుణంబగు భంగి
రాగభేదంబుల సాఁగఁజేసి
భావంబులను సులభంబుగా నెఱిఁగించు
లలితాంగహారంబు లలరఁగూర్చి

తే. గీ. చూపునకు మోదమిడు పదిరూపకములఁ
బ్రకృతియై యొమ్మిదింటికిఁ బఱఁగునట్టి
నాటకంబుఁ బ్రదర్శించి నాకవార
కాంత లిరువురిఁగొలిచిరి కొంతసేపు. 109

ఉ. అంతట నూథభార్యుఁడగు నాహరునింగని వేల్పువెల్ల శా
పాంతమునన్ స్వకీయతనువందిన యవ్విషమేషుసేవనుం
గొంతయనుగ్రహింపఁగఁ దగున్సురనాయక! యంచుఁదత్కిరీ
టాంతిక సంచితాంజలి పుటావళులై తగఁదన్ను వేడిరన్. 110

తే. గీ. విగతమన్యుండు భగవానుఁడగునుగాక
యనుచు మరుతూపుపని తనయందునోపెఁ
గార్యవిశాఖల సంప్రయుక్తమగునట్టి
భర్తృవిజ్ఞాపన ఫలంబుఁ బడయునుగద. 111

మ. గిరిశుం డంతట వేల్పులన్వడచి డాకేలంగిరీంద్రాత్మజా
కరముందాలిచిపూర్ణహేమఘటయుక్తంబున్ సమృద్ధప్రసూ
న రమాకీర్ణము భూతలోపరి పరిన్యస్తార్ద్ర శయ్యంబునై
కరముద్భాసిలుగౌతుకాలయముఁగాంతన్ జేరెసంతుష్టుఁడై

ఉ. క్రొత్తగఁబెండ్లియాట మదిలోనుదయించెడి సిగ్గుభూషగా
నత్తరి మోమువంచి శయనాళులకుం దగునుత్తరంబిడన్
జిత్తమునందు జంకుతరుణీమణిఁ జాటుగనవ్వఁజేసె లో
కోత్తరుఁడింపుమీరఁ బ్రమథోత్కరవక్త్రవికారచేష్టలన్.

తే. గీ. పాణిపీడనమగుట కవ్వల గిరిసుత
తనవలనఁ గన్న భావసాధ్వసమువలన
మానసాకర్షకంబగు మహితకామ
దోహదసుఖంబు జనియించె నాహరునకు. 114

సీ. ప్రాణనాథుఁడు తన్నుఁబల్కరించిననైన
లలన పల్కఁగనోడు లజ్జతోడ
నునుపైఁటచెఱఁగును గొనఁగాఁదమి హారుండు
పోవనెంచును మేనఁబులకలెత్తఁ

బతిశైతవంబుచేఁ బవళించి నిదురింపఁ
గందోయిఁ దన్ముఖంబందు నిలుపు
నవ్వుచుఁ జెరువఁగా నయనముల్ పతి విద్యు
దాహతంబట్లు తా నంతమూయు

తే. గీ. నాభిదేశంబునందిడు నాథు కరము
నడ్డగించెనుకాని యయ్యతివమిన్న
తాను దాల్చిన చేలంబు తనకుఁదానె
దూరవిస్రస్తనీవిసంభారమయ్యె. 115

తే. గీ. అహ్హ! యెంతటి మనోజ్ఞ నీలీల నోలి
నభయభంగిగ సేవింపు మనుచెలినుడి
నాత్మవల్లభుఁ డెదురుగ నలరుచుండ
నాకులతఁదాను మఱచె నహార్యకన్య. 116

తే. గీ. సరససల్లాపవర్ధనాసక్తుఁడైన
శంభుఁడేమేమొ ప్రశ్నలఁజాన నడుగ
జూపున గ్రహించి యూదల నూపి తగిన
యుత్తరమొసంగుఁ దాను లోకోత్తరునకు. 11

ఉ. కోమలగాత్రినూతన దుకూలముఁ దాహరియింప నేర్పునన్
సోమకలావతంసుఁడు ప్రసూనశరప్రమద ప్రమత్తుఁడై
కామిని సిగ్గునన్మగని కన్నులమూయఁగ ఫాలదృష్టిచే
నామహితుండుకాంచె తనయత్నమువ్యర్థముగాగ నయ్యెడన్.

తే. గీ. చుంబనములందు నోష్ఠదానంబులేక
కౌగలింతల సాదరకరయుగంబు
లేని యుపరుద్ధ మన్మథమౌ నవోఢ
రతము నతిమాత్రిమతమయ్యె శితిగళునకు. 119

తే. గీ. ప్రియుఁడుదయతోడఁ దానాచరించినట్టి
యక్షతాధరమైన యాస్యగ్రహణము
వ్రణపదంబులు లేనట్టి సునఖరమును
నగతనయ నోపె నంతకు మిగులకుండ. 120

ఉ. రాతిరిసంగతిన్నుడువు రాజముఖీ!యనుచుం బ్రభాతమం
దాతతభంగిఁ బృచ్ఛఁగొనునాళిజనంబులకు న్వచింపఁగాఁ
జేతమునందునియ్యకొనుఁ జిత్తమునంజనియించు సిగ్గునం
గాతరభావముం జెనయుఁ గంజదళాక్షి రహస్థలంబునన్. 121

క. పరిభోగంబుల ముకురాం
తరమునఁ గను తనకు వెనుక నాథుప్రతికృతిన్
స్వరుచిరబింబమునకు నెదు
రరయుచుసిగ్గుననొనర్చె నాయాచేష్టల్. 122

తే. గీ. ఆభవపరిభుక్తయావన మైనకూఁతు
నరసి మేనక మది నతిహర్షమందె
యువతు లా భర్తృవాల్లభ్య మొందికాదె
మాతృమానసికవ్యథ మాన్పుచుండ్రు. 123

తే. గీ. దినము లిటుకొన్ని గడువఁగ దేవదేవ
కష్టచాలితపదయగు గలువకంటి
జ్ఞాతమన్మథరసయౌచుఁ జేతమందుఁ
గ్రిమవిధంబుగ వీడెను రతివిముఖత. 124

తే. గీ. భర్తయాలింగనముఁగొన భయమునందుఁ
బార్థితానన మెడచేయరాక యుండు
నతివ మొలనూలు పరిచయమందినట్టి
ప్రియతమునిహస్తమును నివారించుచుండు. 125

తే. గీ. చాటుమంతమ్ము భావసూచక మదృష్ట
విప్రియమును బరస్పరవృత్తియైన
శివుల ప్రేమరసము కొన్ని దివసములకు
నిముసమెడమును సహియింప నేరదయ్యె. 126

మ. అనురూపుండగు భర్తనంది వధువెట్లానందముంబొందె న
ట్లనురూపన్ వధువున్ భజించి వరుఁడాహ్లాదంబునుం జెందెఁబో
యనురూపుండగు సాగరుం జెనకి యాహ్లాదంబునుం గంగయ
ట్లనురూపన్భజియించి గంగనతఁ డత్యానందమందుంగదా. 127

ఆ. వె. నిధువనోపదేశి విధుకలాధరుఁడుగా
శిష్యతన్గ్రహించి చేరియొంటి
నువిద నేర్చెదేని నొసఁగె నద్దాని నా
చార్యదక్షిణనుగఁ జాననేర్పు. 128

తే. గీ. అధరపల్లవవేదనా విధుతపాణి
పంకజద్వంద్వయగు గాంత బాధమాపె
నిజమకుటకోటి ఘట్టితేందీవరాప్త
నవకలాస్నిగ్ధ శీతాంశు నివహమంపి. 129

తే. గీ. చుంబనములందుఁగుంతల చూర్ణవృతము
నంబకంబు లలాటజం బభవుఁడు నిడె
ఫుల్ల జలజపరిమళ సంపూర్ణమైన
యద్రిజానన గంధవాహమున కపుడు. 130

తే. గీ. అట్టు లింద్రియసుఖవర్త్మ ననుగృహీత
మన్మధుండగు నభవుం డుమయునుదాను
మాసమాత్రంబు వసియించి క్ష్మాధరేంద్ర
భవనమం దంత నొక్కఁడా వాసరమున. 131

చ. నిజతనయావియోగభర నిశ్చలుఁడౌ తనమామయాన న
గ్గజదనుజాంతకుండు తనకాంతనుగూడి వృషంబునెక్కి వే
గఁజనియె నిచ్చవచ్చిన రకమ్మున నెల్లెడ సంచరింపఁగా
విజితమదేభకుంభ పృథిపీధ్రి సుతాకుచయుగ్మపూర్వుఁడై

తే. గీ. పవనజవయానుఁడైన యబ్బవుఁడు మేరు
ధారుణీధరతట మనోహారి హేమ
పల్లవవిభంగ క్లృప్తతల్పమునసురత
తత్పరుండయి గడపెను తత్ క్షపలను. 133

తే. గీ. శార్ఙ్గి వలయాంకితాశ్మముల్ సౌధబింబ
కలితములునైన మందరకటకముల ని
వాస మొనరించెఁ గేళితత్పరతమీఱ
శైలతనయాననాంబుజ షట్పదుండు. 134

తే. గీ. రావణక్ష్వేడభీతయా రమణితోడ
గంఠసంసక్త మృదుతర కరయుగుఁడుగ
నేకపింగళగిరి విమలేందు రుచులఁ
గర మనుభవించెఁ దమి నా జగద్గురుండు. 135

చ. ఘనసలిలప్రసారములఁ గాంతను మీలితనేత్రఁ జేయఁగా
వనిత నితాంతలజ్జ ముఖవారిజమం దుదయింపఁగాఁ గన
త్కనక నవారవిందమునఁ గాంతుని నేయుచునిట్లు స్వస్తరం
గిణిఁదమితీరఁగా సలిలకేళులఁ దేలి రిగుర్వుప్రీతితోన్.

క. కమలమునఁ గేలఁదాలిచి
కమలనయన చూడనొప్పె గంగాధునిలో
కమలమును గేలఁదాలిచి
కమలధియం దుండునట్టి కమలయుఁబోలెన్ 137

వ. తదనంతరంబునఁ దత్తరంగిణీతీరంబుఁబేడి నందనవనంబునకేగి యద్దైవతలలామ పులోమ తనయా కుంతలసంతతులకు వింతకాంతుల సంతరించు మందారకుసుమసందోహంబుచేత నాబృందారకసుందరీబృంద మానందపూర్వకంబుగ నందంద

సందర్శించుచుండఁ బుండరీకనయననలంకరించుచుఁ జిరకాలంబు నానాసుఖంబు లనుభవించుచు నొక్కవాసరంబున వాసరరాజ కిరణసందోహమారుణ్యభూషితంబగు చుండ నానీలకంధరుండు గంధమాదనపర్వతంబునకేగి తత్ప్రదేశంబున 138

చ. లసదురుకాంచనోపల తలంబున నంబుజగంధితోడ న
య్యసమవిలోచనుండు దరహాసమెలర్పఁగఁ గూరుచుండి బ
ల్పసచెడినేత్రగమ్యమగు భాస్కరమండలముంగరాంగుళిన్
బసదముతోడ జూపి యను భర్గుఁడు పంకజపత్రనేత్రతోఁ

తే. గీ. పడతి! యీసూర్యుఁ డరుణత్రిభాగములగు
నీదుకనులఁ గమలకాంతినింపివోలె
సంక్షయంబున జగతిఁబ్రజాపతిఁబలె
దినము నుపసంహరించెడి తెలుఁగుఁగనుము 140

తే. గీ. సామిజగ్ధాంబుజాత కేసరము విడచి
విపరివృత్తాత్మగళములై విధృతీన
ములయి కూసెడియీచక్రములకు నల్ప
మంత మనల్పతనుబొందె నంబుజాక్షి! 141

తే. గీ. పగటినెలవులవీడి యేనుగలగములు
పల్లకీవల్లికాపల్లవోల్లసితము
వారిరుహబద్ధషట్పదవరము జలము
నా పరిభాతాశనంబునకై గొనియెడి. 142

తే. గీ. కుఱ్ఱింకు దెస వేఁడిలు సూర్యుఁడు పొంక మొప్పఁ
బొడవయిన తననీడచేఁ బొనరిచెను స
రోజలంబుల కెల్ల విభ్రాజమాన
కనకమయ సేతుబంధనం బనఁగ నొప్పె. 143

తే. గీ. దష్టబిసములు నాఁదగి దంష్ట్రలగుట
నొప్పెడి వనాంతరవరాహయూథపములు
గాఢపంకాల్పసరములఁ గలఁచి యధిక
వాహితాతపములగుచు వచ్చుచుండె. 144

తే. గీ. హైమరసగౌరమండలమైన యీ మ
యూరరాజంబు వసియించి భూరుహాగ్ర
మునఁ బరిక్షీయమాణము దినము చివరి
యాతపముఁ ద్రావుచున్నది యనఁగనొప్పె. 145

తే. గీ. ప్రాచిఁ జీఁకటి వ్యాపించి పంకమగుచు
నేకపదమున నొప్పఁగా నినహృతాత
పసలిలంబగు నాకస మెసకమెసఁగెఁ
గొంచెమొండిన సరసునాఁ గువలయాక్షి! 146

తే. గీ. మృగము లుటజాంగణంబుల మెలఁగుచుండ
మూలసేకార్ద్రవృక్షకములును గల్గి
యగ్నిధేనువు లేతేర నడవినుండి
యలరెఁ బ్రజ్వలితాగ్నులై యాశ్రమములు. 147

తే. గీ. ముకులితంబయ్యెఁ బద్మంబు ముదముతోడ
వసతి నిందిందిరమునకు నొసఁగఁదలఁచి
యనఁగ క్షణమును సావశేషాంతరముగ
నున్న చందంబుఁ గంటె? విద్యుల్లతాంగి! 148

తే. గీ. కలికి! వారుణి దూరమగ్న పరిమేయ
రశ్మి యరుణుఁడునైన యర్యమునితోడ
భరితకింజల్క-బంధుజీవతిలకంబు
చేతఁ గన్యకవలెఁ బ్రకాశించుచుండె. 149

తే. గీ, స్యందనాశ్వమనోహరస్వనములైన
సామముల వాలఖిల్యాదిసహచరమును
లగ్నిపరికీర్ణ తేజసుండైనభానుఁ
బ్రస్తుతించుచునుండిరి భక్తితోడ. 150

తే. గీ. ఆనతశిరోధరములాట నాత్మకర్ణ
చామరవిఘట్టితాక్షులు స్కంధయుగకు
టిలితరోమంబులగు హయములును దాను
నస్తమందె నినుఁడు దిన మబ్ధివైచి. 151

తే. గీ. అస్తమంద నినుండు వియత్తలంబు
పడతి! నిద్రించురీతినిఁ బఱఁగె నధిక
తేజమున కిట్టిగతియగు తెల్వినున్న
వెలుఁగు చీఁకటి కాకున్న వెలఁదిమిన్న! 152

తే. గీ. శీతభూధరసుత! రక్తపీతకపిశ
ములగు నివ్వారిధరకోటు లలరె నీవు
చూతువని సంజ వర్తికఁ జేతఁ బూని
వ్రాసి నిర్మించినట్టి చిత్రంబులనఁగ. 153

క. సింగంపు జూలు జడలన్
రంగగు నలరులుగల తరుల్ ధాతులస
చ్ఛృంగంబుల సాంధ్యాతప
ము గొనసరెను చరమమనఁగఁ బొలిచెడిఁ గంటే?

శా. పాదాగ్రంబులనిల్పి పూతసలిలోపాత్తార్ఘ్య పారీణులై
వేదాశేషవిశేష విజ్ఞులు మును ల్వీరే కురంగాక్షి! ని
ర్నాదప్రస్ఫుర దోష్ఠపల్లవము గల్ సంధ్యాభిముఖ్యంబులో
నాదర్శింపు జపించుచుండిరొగి గాయత్రీమహామంత్రమున్.

తే. గీ. కాన ప్రస్తుత నియమంబు నేనొనర్ప
ననుమతింపఁగఁ జెల్లు నహార్యకన్య!
యొకముహూర్తంబు చేయుచు నుందు రి చెలులు
కాలయాపన మని కాలగళుఁడు పలుక. 156

ఉ. ఆపలుకాలకించి హృదయాబ్జమునందు నవజ్ఞలోప న
కోపన మోవి వంకరగఁ గూర్చి సమీపగతాళితోడ నా
లాపము చేయుచుండ విధులన్విధియించి సమంత్రికంబుగా
నా పలుకాడకున్న సతినారసి నవ్వుచు శంకరుండనున్.

ఉ. కోపముమానుమింక మదిఁ గోమలి! నేనొనరించినట్టి దే
పాపము కాక సంధ్యకతిభక్తిమెయిన్నమనంబొనర్చి తీ
నాపయిఁజూపవే కరుణ నమ్మవుగా సహధర్మచారి నో
కోపన! చక్రవాకమునకు న్సరిపోలెదువానిఁగా ననున్.

తే. గీ. పంకజభవుండు పైతృకవర్గమెల్ల
లీల సృజియించి శిష్టంబు నోలివిడువ
నాతనువు సంధ్యయై సేవ్యయయ్యెనిట్లు
కాన మానిని దీన నాగౌరవంబు. 159

తే. గీ. తిమిరవృత్త్యుపరుద్ధమై తేజరిలుట
సురిగ్వపైలగ్నమైనట్టులున్న సంధ్య
తటమునఁదమాలతరులొప్పు ధాతురసఁపు
నిమ్నగయనంగఁ జెలువొందె నీరజాక్షి! 160

తే. గీ. శర్వరీ వాసరో భయసంధిసంభ
వంబు నీ తేజమును మాటుపరుప మేరు
వంధతమసంబు వ్యాపించె నడ్డులేక
దశదిశలయందు ధారుణీ ధరవరసుత! 161

తే. గీ. పయినఁ గ్రిందను వెనుకను బ్రక్కలందు
వీక్షణమ్ములఁ బ్రసరింప వీలులేక
విశ్వ మిది తామసోల్బణవేష్టితమయి
గర్భవాసంబువలెనున్న కరణిఁ గంటె? 162

తే. గీ. స్వచ్ఛ మావిల మచరంబు చరము వక్ర
మార్జవగుణాన్వితంబగు నట్టి వస్తు
జాతమంతయు సమముగానల్పెఁ దమ మ
సాధుజనములవృద్ధి యీచందమకద. 163

తే. గీ. శార్వరతమంబు పోవ యజ్వపతి యిప్పు
డుదయమును బొందనున్నవాఁ డుజ్వలాంగి!
పూర్వదిఙ్ముఖ మొప్పెను మొగలిపూల
పుప్పొడులఁ గప్పఁబడినట్టి పోల్కిఁగనుము. 164

తే. గీ. చుక్కఁగుమిఁగూడి రాతిరి శోభనాంగి!
మందరధరాంతరితుఁడగు నిందుతోడఁ
బ్రీతి నీపల్కు వినఁగ నేవెన్కనుండఁ
జెలులతోనుండు నీదగు జెన్నుఁ దాల్చె. 165

తే. గీ. పక్వఫలినీఫలప్రభ వఱలునితఁడు
నభమున సరోరుంబువులను మండలమునునిచి
యంతరమునంది యధికవిహ్వలములైన
చక్రవాకంబులం బోలెఁ జాన! కనుము. 166

తే. గీ. అప్రగల్భయవాంకుర సప్రకాశ
ములును సద్యస్సముత్పన్నములునగు శశి
కరము లింతిరో! తావకకర్ణపూర
ములపసలున ఖరాళిఁ ద్రుంపుటకుఁదగును. 167

తే. గీ. వేళులం గొప్పనుంబలె స్వీయఘృణుల
లీల దమమునుఁ గొని కుట్మలీకృతాబ్జ
నేత్రమైనట్టి యీరజనీముఖంబుఁ
జుంబన మొనర్చుచుండె నా శోభిలె శశి. 168

ఆ. వె. ఇపుడు పొడమినట్టి యిందురశ్ములచేత
సామిభిన్నతమము వ్యోమతలము
ద్విరదకలుషితమయి తేరుచునున్న మా
నససరంబువోలెఁ బొసఁగెఁ గనుము. 169

గీ. తే. రక్తభావంబుపీడి యోరాజవదన!
పుండరీకారి పరిశుద్ధమండలుఁ డయి
యలరె నమలాంతరాత్ముల కరయ వికృతి
కాలదోషంబువలననే కలుగుఁగాదె. 170

తే. గీ. ఉన్నతతలంబునందుండె నుడుపకాంతి
యంధతమసంబు గర్తాళి నణఁగియుండె
నరయ నిట్టిద యజుసృష్టి యాత్మసదృశ
గతులగుం గుణదోషముల్ కంబుకరి! 171

తే. గీ. చంద్రిమఃపాదజనిత ప్రసర నవేందు
కాంతమణిబిందువులచేత క్ష్మాధరంబు
కటకతరు నిద్రితములౌ శిఖండులకుఁ బ్ర
బోధ మొనరించె నసమయమున లతాంగి! 172

తే. గీ. ఇప్పు డవికల్పసుందరి! హిమకరుండు
కల్పతరుశిఖరములందుఁ గాౘిలు నాత్మ
కరములన్ హారయష్టుల గణనఁజేయఁ
గుతుకమును దాల్చెనంచనఁ గొమరుమిగిలె. 173

తే. గీ. ధరవరం బున్నతావనతప్రదేశ
ములు కలదికానదమముతోఁగలసి జ్యోత్స్న
వివిధరచనార్పిత మదేభ విభువిభూతి
చందమునఁ జెన్నుఁగాంచె నోచంచలాక్షి! 174

ఉ. ఐందవచంద్రికారసమునాని సముచ్ఛ్వసితంబులెక్కుఁడై
తుందిలతన్భజించి యతిదుస్థితినంది వహింపలేక నిం
దిందిరరావదంభమున నేడ్చుచు నంతట నుద్భిదత్వముం
బొందెననంగనొప్పెఁ బరిపుల్లముకైరవ మంబుజాననా!

తే. గీ. కల్పతరులంబమానాంశుకంబు చండి!
చంద్రికాకృతరూపసంశ్రియత నంది
మందపవమానచాలితంబగుచుఁ గాక
తెలియఁగారాక యొప్పె నెంతేనియిపుడు. 176

తే. గీ. చారుముఖి! కాంచు మిప్పుడీ చందురుండు
తరళమండలయగు మోగతారతోడ
భయమునం గంప మొప్పు నుద్వాహమైన
కన్యతో వరుచందానఁ గలియుచుండె. 177

తే. గీ. పాకవికసితశరకాండభాసురముల
నీదు గండతలంబుల నీరజారి
ప్రతిఫలించుచునుండ నోపడఁతి! వెలుఁగు
మొలక లుదయించె వీన నాఁ జెలఁగెమిగుల. 178

తే. గీ. అరుణఖరభానుమణిభాజనార్పితంబు
నలరుఁ గల్పద్రుమద్యంబు నవధరించి
యుచటనున్నట్టినీకొఱకింతి! గంధ
మాదనవనాధిదేవత మహిత వచ్చె. 179

తే. గీ. అర్ద్రికేసరసురభియు నఱయ మత్త
మత్తనయనంబునై ముఖమండలంబు
భాసిలుఁ నీకుఁ ద్రావెడియాసవ మిది
యేగుణాంతరమును గూర్చు నిందువదన! 180

ఆ. వె. అయినఁ జెలులభక్తి నాదరింపఁగఁజెల్లు
దేవి! దీనిఁ గామదీపకంబు
నర్థిఁద్రావుమనుచు నాదరంబున నప్పు
డ్రావఁజేసె సతిని రాజమౌళి. 181

ఆ. వె. మదిజనించు లజ్జ మఱలింపఁగాఁజేయు
నిద్ధరాగులైన యుద్దరకును
వదనజితశశాంక వశవర్తినిగ నయ్యె
మదమునకును విజితమదనునకును. 182

మ. భ్రమదక్షిద్వయము క్షనలత్పదము శుభ్రస్వేదసంయుక్తమ
చ్ఛమధుస్వాదమదాపహేతులవ హాసస్ఫూర్జితంబైన త
ద్రమణీవక్త్ర సరోరుహంబుఁ దమిదీరంగాంచె శంభుండు చి
త్తమునం దెంతయువృద్ధినందగను కందర్పప్రరోహావళుల్

తే. గీ. వ్రేలు మొలనూలుఁ దాలిచి పృథులజఘన
భారదుర్వహాయగు దనభార్యతోడ
ధ్యానసంభృత విభవనిధానమైన
మణిశిలాగృహమును జేరెఁ ద్రినయనుండు. 184

మ. అదితిప్రోద్భవవంద్యుఁడాగృహమునన్ హంసావదాతోత్తర
చ్ఛద సంవ్యాప్తముకాన జహ్నుతనయాశైవాలిస్సైకతం
బిది నాగందగు దాన్పుఁ గూర్మినధిరోహించెం బ్రియామిత్ర మ
భ్యుదయాకీర్ణుఁడు రోహిణీశుఁడు శరద్యోగాంబుదంబుంబలెన్.

ఉ. క్లిష్టహిమాంశురేఖ మసకృత్పరిపీడితసుస్తనంబు సం
దష్టసుధామయాధరము తత్సముచితభంగిసంగృహీ
తాష్టపదీనఖక్షతసమావృతమయ్యె నుమారతంబు సం
తుష్టునిజేయఁ జాలదు మనోభవశాసను నాసతీరఁగన్.

మ. ప్రియురాలన్న దయావిశేషముననో రిక్క ల్వినమ్రింబులై
వియదంతంబుననొప్పఁగా హరుఁడుదేవీసంగృహీతోరసుం
డయునిద్రించి యుషస్సునందుఁ దపనీయాబ్జాళితో పాటుగన్
నయమొప్పంగడుఁ బాడుగిన్నరులగానవ్యాప్తిచే మేల్కొనెన్

తే. గీ. శిథిలితాలింగనులగుచుఁ జెలఁగుశివుల
రచితమానసతుంగతరంగ మజ్జ
వికసన పిశునమగుచు సేవించె గంధ
మాదనవనాంతరకుమార మారుతంబు. 188

క. మరుదుచ్చలితపటంబును
దరుణి సరిగ ముడుచుకొనెడితఱి వారించున్
హరుఁడూరుమూలనఖపద
సరణీహృతనయనసరసిజాతుండగుచున్. 189

మ. పదరాగాంచితము న్విభంగివిషమప్రచ్ఛన్నవస్త్రంబు మ
ధ్యదరాక్రాంతవిసూత్రమేఖలమునొ తచ్ఛయ్య నీశుండినుం
డుదితుండైనను వీడకుండ ముద మున్యోజించుగాంతాధరో
న్మదిరాపాన పరత్వమొప్పగడపె న్నక్తందివంబు ల్దనర్న్.

క. సమదివస నిశీథంబుగ
నుమతో సంగమమొనర్చుచుండిన యమృతాం
శుమకుటునకుఁ దోఁచెను సా
ర్ధము ఋతుశత మపు డొకండు రాత్రిగఁ దనరన్.

క. తాదృశసురతసుఖంబులఁ
దాఁ దమి నందియును దృప్తతను గనఁడుహరుం
డౌదర జలౌఘములచే
యాదఃపతిలోని బాడబానలము వలెన్. 192

మ. విధు తారు ణ్యవదాతప న్నిజ యశోవిస్తార విస్తారపా
పధరాభృద్భిదురా నిదానధన విద్వల్లోకరాకోడుపా
బుధరాజ స్తవనీయశిష్యపరిష ద్బోధావిధేయత్వభా
ఙ్మధురాలాప మధుప్రహారి పదపద్మధ్యాన లీనోన్మనా.

క. కరుణాకర పరమగుణా
భరణా కరిరాజవరదపద పతితాంతః
కరణా తతపావనసం
చరణా సంచలిత బంధుజనతాదరణా 193

మాకరందరస మాధురీధురీ
మాకరస్వవచ మాన్యసద్గుణా
నాకరాడ్గురుమనస్క మానస
స్వీకృతేశపద విజ్ఞభూషణా 194

గద్య:—ఇది శ్రీమ ద్బాలా త్రిపురసుందరీ ప్రసాదాసాది
తానవద్య కవితా యోగహృద్య భారద్వాజగోత్రపవిత్ర
మహితాప స్తంబసూత్ర లక్ష్మీనారాయణ యజ్వపుత్ర
గురుజనాశీర్వచనపాత్ర విజ్ఞజన విధేయ యజ్ఞనారా
యణ నామధేయ ప్రణీతంబగు కుమారవిజయం
బను ప్రబంధంబునందుతృతీయాశ్వాసము



# కుమారవిజయము.



## చతుర్థాశ్వాసము

క. శ్రీమద్గోపాలాచా
ర్యామానుషఫలమయా నిరంతరకరుణా
భూను కొమాండూర్వేంకట
రామానుజనామధేయ ప్రాజ్ఞవిధేయా.

వ. ఆకర్ణింపుము.

శా. కాంతాదివ్యముఖారవిందమదభృంగంబీశ్వరుం డావిర్భ
స్వాంతోద్భూతరస ప్రసంగపరుఁడై యట్లుండి సంభోగగే
హాంతంబుఁ జొరఁ బారిపచ్చెడి నొకండా పావురంబుంగనెఁ
బ్రాంతారక్తవి ఘూర్ణితాక్షు సితరుద్వర్ణుఁ లసత్తుండజిత్తుఁ

వ. వెండియు నయ్యండజమండలేశ్వరుండు సుకాంత కాంతామణితానుకారుండును, ప్రిస్ఫారితోన్నమ్రకంధరధరుండును, ముహుర్ముహర్న్యంచితాచ్ఛపుచ్ఛభాగుండును, విశృంఖలవలక్షపక్షతియుగ్మమందవిక్షేపణ శిక్షాక్రిమదక్షుండును, జటిలాగ్రిపాదుండు నితస్తతోమండలక సంచరణాంచితుండును, రతిసహితమనోభవప్రవిగాహ్యమాన సుధాప్రవాదసంభూతనూతనూతనడిండీరచయశంకాసంపాదకుండునై యుందుఁ మాళి కమందానందంబు నాపాదించె ననంతరంబ

తే. గీ. దివ్య మతిహృద్యమా బత త్రిస్వరూప
మరసి యంతర్భవత్త్రైకతవాండజుఁడగు
వహ్ని యితఁ డని తెలిసి యబ్భవుఁడు రోష
భీషణభ్రూవిభంగ దుష్ప్రేక్ష్యుఁడయిన. 3

మ. స్వకరూపంబునుదాల్చి పావకుఁడు నిశ్వాసస్ఖలత్కంఠస
క్తకరాబ్జుండు బ్రివేపమానుఁడగుచుం దద్దేవుతో వ్యక్తసా
ర్థకమా వాక్యముఁబల్కెనిట్లు సురనాథా! నీవదేవేంద్రపూ
ర్వకదివ్యాళులఁ బ్రోచువాఁడవు జగద్రావైకనాథుండవున్.

సీ. కనుక నాయపరాధమును మనంబున నిడ
క నితాంతదయతోఁపఁ గనకశైల
కమనీయకోదండ! మముఁగావఁజూడుమం
చు మొఱవెట్టుకొను నింద్రిముఖసకల
సురకదంబముల నాసురకంఠ లుంఠనో
త్కంఠావికుంఠేశ! కావుమిపుడు
పరతిరస్కృతులైన వారలు శరణన్న
వారలు తంద్రినోపఁగలరయ్య

తే. గీ. వీరు, కావున నాసురవీర కమల
వనశిశిరకరకర దాశుగని వహాఘ్యు
నింద్రిసామ్రాజ్య దాననిస్తంద్రునొకని
మాకుదయచేయుమయ్య కుమారచంద్రు. 5

క. అనిపలుకువహ్నియాచన
నవవద్యార్థను వినివిని హరుఁడు సుముఖుఁడ
య్యెను గిరీశుండీశునిఁ
దనవానినిఁజేయఁగా సుధద్వచనములన్. 6

ఉ. అంతటఁ దారకారిజయియౌసుతుకోసము వజ్రిభృచ్ఛమా
కాంతజయంబుకోసము నఖండిత నిశ్చలతందలంచి తా
స్వాంతమునందు స్వాంతభవవైరి కృశానునియందువై చెఁ గ
ల్పాంతకృశానుకల్పమభియాతమఁ దత్స్మరతాంత రేతమున్.

తే. గీ. భీమకర్ముఁడ వీవు కృపీటజన్ముఁ
డా! యిక సమస్తభక్షకుఁడవును గుష్ఠ
పీడితుఁడవు ననలధూమవృతుఁడవగుమ
నుచు శపించెను కుపితయై యచలకన్య. 8

మ. సురతానంద సుఖాతిభంగముననాక్షోణీధ్రరాట్కన్య య
ట్లు రురోషంబున శాపమీయఁదనకు న్నోష్మాంశుఁడా దక్షశా
పరుజన్ మంచుననబ్జకోశమువలెం బ్రక్షీణతంబొంది తా
నరిగెన్ వహ్ని పురారివీర్యనిచయాత్యంతావరూపాంగుఁడై.

క. పావకసందర్శనరో
షావిలలోచనను మదనహాసహీంద్రభూ
రావినమితముఖిఁ దనిపెను
దేవుఁడు శృంగారభావ ధృతి చణసూక్తిన్. 10

తే, గీ. సుందరి ముఖారవిందంబునందుఁ గరము
లందుఁ దోఁతెంచు ఘర్మాంబుబిందువులను
వ్యజనమును వీచి తచ్ఛీతలానిలమున
నేదఁగాఁజేసె వెదకి ఫాలేందుధరుఁడు. 11

క. రతిసమయ లులితమై యం
కతలమునకు వ్రేలు వితతకబరీభరమున్
గతసుమమును ముడివైచె న
మృతరశ్మికలాధరుండు మేల్పూవదండన్. 12

క. ప్రియురాలి నునుపుఁజెక్కిలి
పయిన్ మృగనాభిచిత్రపత్త్రావళులన్
నియమించెను శివుఁడు జగ
త్త్రియమోహన మదన మంత్రరాజాక్షరముల్.

క. కరరుహపాళీధరమగు
తరుణి నితంబమునఁ గట్టెఁ దా మొలనూలున్
హరుఁ డెడఁదయను మనోభవు
పరుగిడు హరిణమునుఁ బట్టు పాశంబనఁగన్. 14

క. చెలిమెడ నభికుచముగ ము
క్తలహారమునునిచె నతఁడు ధరణీధర మూ
ర్ధలసద్గంగావాహయు
గళసౌందర్యంబునంది కరము వెలుంగన్. 15

ఉ. పాదసరోరుహాగ్రిములఁ బద్మదళాక్షికలక్తకంబు స
మ్మోదముతోడనుంచి నిజమూర్ధగతంబగు గంగనీటిచే
సాదరవృత్తిఁగడ్గుకొనె నాత్మకరంబుల నిందుశేఖరుం
డేదయితుండొనర్పఁ డిటులే తనకాంతకు మండనంబులన్. 16

తే. గీ. భసితసంలిప్తమౌ నాత్మవపువునందు
దర్పణతలంబునిడి శశిధరుఁడు లీలఁ
బ్రాణవల్లభ నలరు నేపథ్యలక్ష్మి
నరయఁగాఁజేసె రాగవశాత్ముఁడగుచు. 19

మ. ధవదత్తంబగుఁ దర్పణాంతరమునం దన్వంగి సంభోగచి
హ్నవిశిష్టంబగు దేహముంగని మదిన్ రాణింపఁగాసిగ్గు త
న్నవశుభ్రాంశుకలావతంసుకొలుకున్బాహ్యంబునుం జేసెఁజా
రువిలోలాక్షి ఘనానురాగభరమున్ రోమాంచదంభంబునన్.

క. చెలువుండూనిన దర్పణ
తలమున నేపథ్యలక్ష్మిఁ దాఁ గనుఁగొని కో
మలి సౌభాగ్యవతులలో
పల ధుర్యనుగాఁ దలంచె భావమునందనన్. 21

క. వారలటులుండ నప్పుడు
చారునయన లా జయావిజయ లరుసమునన్
జేరి హరాంకస్థిత కుప
చార మొనర్చిరి కలాసుసంపద నుమకున్. 22

శా. ప్రాతఃకాల సహేలసంభృతలసత్స్వర్ద్వారకాంతావలీ
గీతవ్రాతనినాదవందిజనసంఘీభూతనైజాపదా
నాతిస్తోత్రనిశంఖకిన్నరచయ వ్యాపారముల్ మొత్తమై
శ్రోత్రశ్రీర్ష గిరీంద్రకన్యకల కాలోఁ దుష్టిఁగూర్చెన్ దగన్.

తే. గీ. అంత సేవించుకొనుటకు నఱుఁగుదెంచి
నట్టి నిర్జరగణముల నధికభక్తిఁ
దెలిపెఁ దా ద్వారమందున నిలిచి నంది
సంచితాంజలిపుటుఁడయి శశిధరునకు. 25

ఉ. మానసరాజహంసియగు క్ష్మాధరరాజతనూజతోడ న
మ్మానసజాతశాసనుఁడు మందగతింజనుదెంచె వేల్పులున్
మానులు దేవయోనులును మానితభక్తి భరాతిరేక న
మ్రానను లైనిజాంఘ్రులకు నాదరవృత్తినమస్కరింపఁగన్.

వ. తదనంతరం బాబుజోదర ప్రముఖులగు మఖభుజుల నుచితభంగిఁ బోవంబంచి శైలతనయతోఁ గూడి మనోతివేగం బగు వృషబంబు నెక్కి యావృషాంకుండు గగనాధ్వనీనుండై.

సీ. గగనకల్లోలినీ కల్లోలకరబిందు
ముక్తాఫలాళి సంపూరితంబు
విధువనాంత నితంబినీ జన శ్రమవారి
మందీకరార్జవ మానితంబు
నందనాభిధవనీ మందారసుమపరీ
మళసుసంభార సంభారకంబు

మలయభూధరతటీ నిలయచందనలతా
సలలితకిసల సంచాలకంబు
తే. గీ. స్వర్భవస్త్రైణ వీణారవప్రరూఢ
సరససంగీత సంరావ సంయుతంబు
మందమంద ప్రకారంబు మారుతంబు
చంచలాక్షిని దన్ను సేవించుకొనఁగ. 28

తే. గీ. అతివిభూతియుతమును దిగంబరాఢ్య
మిందుచూడామణీడ్యమై యెసక మెసఁగు
నట్టి కైలాసపర్వత మభవుఁ డెనసెఁ
దనశరీరంబునుం దాను దరిసినట్లు. 29

వ. వెండియు నక్కండలిరాజకుండలుని కొండ వెండి కొండయగుట తనయండను మాఁడనమండితలై పతులంగూడి మెండుగసంచరించు వేల్పువెలయాండ్ర ప్రతిబింబంబుల నవలంబించి యానితంబినుల కితరబింబాధరలను సందియంబు డెందంబులయందు బొందుపఱచి మనఃప్రియులయం దాసుముఖుల విముఖల నొనర్చుచు నచ్చంపుఁ బటికరాపలకమాటున పొన్పుగఁ బ్రతిఫలించు గలువనెచ్చెలికానిమచ్చ గట్టురాపట్టి రసాతిరేకబునఁ బెట్టిన కస్తురిబొట్టనఁదగునట్టి దానినిగఁ జేయుచుఁదన లోఁగనఁబడుప్రతికృతులనవలోకించిమించినరోసంబున మైవెంచి మదించిన యేనుంగులనుశంక యంతరంగంబులఁ జెలువార భీకరంబులగు గోరల నూరకసంఘట్టనంబులొనర్చుఁ గంఠీరవంబుల

గములఁ బోఁ దిఁజేయుచు రేల రాలవెలసిన లెక్కకు మిక్కిలి యగు రిక్కలఁగని రతాంతంబునరాలిన ముత్తియంబుల మొత్తంబను శంక చిత్తంబునఁ దలకొత్త నుత్తలపాటునందెడి సిద్ధమత్తకాశినులకు నికేతనంబై వేల్పుపడఁతుల తొడవులకుఁ డడువుకొనని నిద్దంపుటద్దంబనఁదగు దమ్మిగొంగ నుత్తమాంగంబున వెలలేని తలమానికంబునుబోలెఁ దాల్చునదియు కంతుసంతాప మింతంతయనరాక తమకాంతలఁగూడి రంతుకాములై యంతికంబునకు నేఁగుదెంచిన నాకౌకసుల నేకాకులనైన ననేకకాంతాసమాకీర్ణులనుగాఁ జేయుచు నగాధిరాజంబనఁజెల్లు రాజతగిరిరాజంబున రాజకిరీటుండంభోజలోచనతోడఁ బ్రవేశించి తదీయతుంగశృంగంబులయందు యదృచ్ఛాసంగతంబులగు శృంగారభంగీవిశేషంబులచే నక్కురంగనయన యంతరంగంబుఁ బల్లవింపఁజేయుచునిచ్ఛానుసారంబుగవిహారంబుగావించు నెడ.

శా. నందీశుండు పురోగుఁడై వినమితుండై మార్గదర్శిత్వముం
జెందన్ జంద్రికలావతంసుకరముం జేబూని సోల్లాసల
క్ష్మిందల్కొంది విహారమున్ సలిపెనమ్మీనాక్షి పాదోపరి
స్పందన్నూపుర మంజు శింజితకలా సన్నద్ధవాల్లభ్యమై. ౩౧

చ. తరళచలచ్ఛిఖాగ్రుఁడుసుదంతురుఁడున్ సితతీక్ష్ణతుండుఁడా
ఖురుఁడల భృంగి శంకరుని కన్సైగచే నుపదిష్టుఁడౌచుఁ దాఁ
గరమరుదైన నర్తన మఖండితనైపుణితోడఁ జేసెఁబో
యరుణతరాధరంబున సితాంశువు లుప్పతిలంగ గౌరికిన్. ౩౨

ఉ. శైలసుతా వినోదమును సల్పఁగ నాయతకంధరస్థలీ
లోలకపాలమాలయు విలోకన భీకరదంష్ట్రికాకలా
పాలసతాయుతాననయునై నెగడొందెడికాళిచేత న
బ్బాలశశాంకశేఖరుఁ డభంగురతాజరిపించె నాట్యమున్.

తే. గీ. వికటముగ నాడువారాట భీకరులగు
వారిఁగని భీతివిహ్వలాపఘన యగుచు
శైలజ యనంగశత్రు నుత్సంగ మెనసి
తనకుఁదానె కవుంగిలి దార్చుకొనియె. 34

తే. గీ. పీవరోత్తుంగ కుచపీడపీడమును స
సంభ్రమంబగు గౌఁగిలి శంకరుండు
పొంది వెంటనె మేనెల్లఁబులకలెత్త
మహితమన్మథ లీలాపరిమత్తుఁడయ్యె. 35

తే. గీ. ఆసరణి గౌరితోడ విలాసవివిధ
కేళిభంగులఁ దుష్టుఁడై గిరిశుఁ డాన
గంబునం గృతవసతియై కరము వశ్యు
లైన గణములతో మోదమందుచుండె. 36

చ. అనలుఁడునుగ్రతేజముమహన్మహామట్టులుతాల్చుచున్మరు
ద్గణములతోడఁగొల్వున సుఖంబుననున్న సురేంద్రుపాలికిం
జనఁగఁ దథావిధుఁ దనను జయ్యనఁగన్గొని వేయికన్నులన్
మనమునఁగి న్కతోపతక్షణమాత్రము నెంచిబలాసురారియున్

క. తనదగుదశనరసి విల। క్షణముఖులగు సురలకెల్ల స్వపరిభ

వంబున్ । విని పింపఁబోవు వాతనిఁ । దనదెసనాసీనుఁజేసి
తగనిట్లనిమెఱె. 38

తే. గీ. హవ్యవాహుఁడ! నీవిప్పు డందినట్టి
దశ సుదుర్దశ యెట్టివిధమునఁ గలిఁగె?
జడుపుమాని సమస్తము న్నుడువుమన్న
హుతవహుండును వేడినిట్టూర్పు వుచ్చి 39

మ. తవ నాజ్ఞప్తునిఁ జేయనీవు దివిజతాత్రితా! యభిక్షోణిభృ
త్తనయారత్యనుషుక్తుఁడైన సుమశస్త్రధ్వంసకీయాంతికం
బునకుంబోయితి వేషముప్పతిలఁగాపోతాకృతిందాల్చికా
లునిసాన్నిధ్యమునందుచందమున నాలోనమ్మహేశానుఁడున్.

క. ననుఁగని కపటవిహంగం। బునుఁగాఁ దలపోసియజ్ఞభోక్తృ
పతీ! య। జ్ఞనిహంత ఫాలతటలో । చనకీలినిదాను నను
రుషాదృష్టిఁగనెఱె. 41

తే. గీ. అపుడు సాంత్వనములు మధురార్థములగు
పలుకులఁ నుతింపఁగా శుభశ్రీభావుఁడయ్యె
భీషణుండగు జంద్రార్ధ భూషణుండు
తుష్టిఁగలిగింప దెవనికి స్తోత్రముర్వి. 42

మ. సకలత్రాత జగచ్ఛరణ్యుఁడగు నీశానుండునన్నోమెఁదా
స్వకరోషజ్వలదగ్నిసంచయము గ్రాసత్రాసతోదుర్నివా
రక మాటన్ రభసంబుతో నుమపరీరంభంబుఁబోకార్చి కా
ముకకేళిన్విడచెఱె మదీక్షణసముద్భూతాతిలజ్జాత్ముఁడై. 43

మ. అనలాత్మంబును గర్భవహ్యామును మోయంగా నశక్యంబునై
న నగేంద్రాత్మజ భవేశ వీర్యమునసంతప్తాఖిలాంగుండనై
ఘనసంక్షోభమునందుచుంటి నిపుడీకష్టంబువాయంగ నా
కనువౌనొక్కయుపాయమున్నఁ జెపుమాయాఖండలా వేఁడెదన్.

తే. గీ. అనెడి యావహ్ని పలుకుల నాలకించి
వ్యథ నశింపఁగ హేతువునరసి యెడఁ ద
దగ్ధగాత్రింబులంగేలఁ దడివిచూచి
యొక్కపలుకాడెను కృపీటయోనితోడ. 45

మ. తొలి సేవింపఁగ మేము సంతసము నెంతో పొందె సంప్రాతని
ర్మలతోయైకనిధాన గంగ యటసన్మానంబునం జేరి త
త్సలిలంబందు నమోఘమూర్తిస్థిరము సౌశైవౌజముంచంగనో
జ్వలనా!సీతను తాపమోలిఁ దను తాపంబౌను నిక్కంబుగన్.

తే. గీ. కాన వేగమనివేగి గంగకడకు
శంభువీర్యము నిడుము తజ్జలమునందు
భూతపతి జలమయమైన మూర్తికానఁ
దాల్చు నీకంటె నోపికతనర నామె. 47

క. అనిపలికి యూరకుండిన
ననలుఁడును విసృష్టుఁడగుచు నాతని చేతన్
జనఁగఁ బ్రియాణంబయ్యెఁ ద
దనిమిషకల్లోలినీ మహాతటమునకున్. 48

వ. ఆచందంబునఁ బురందరుచే విడువఁబడి మహానట

జటాజూటనివాసినియు నిశ్శేషక్లేశసంశోషిణియు స్వర్గారోహ
ణ నిశ్శ్రేణియు విశాలపులినసుశ్రోణియు నుదారదురితోద్గార
హారిణియు సగరతనయనిర్వాణకారిణియు దుర్గతారిణియుఁ ధ
ర్మధారిణియు నారాయణపాదజలజసంభూతయు బ్రహ్మలోక
సముపాగతయు నగునగ్గంగానది సమీపించిన. 49

క. అరుదెంచు జాతవేదసు । సురకల్లోలిని నిజోర్మిసుకరమ్ము
లచేఁ । బరమార్థ సిద్ధికొఱకై । యురుకృపచేఁ బిలుచుచు
న్నదో యననొప్పెన్. 50

శా. దుర్వారంబు నమోఘమవ్యయమునిర్ధూమాగ్నిసంకాశమా
శర్వాజంబున నున్నపావకునకున్ సన్మానమున్ సల్పెఁ దాఁ
బూర్వంబందె నిజావలోకనసముద్భూతప్రమోదాతిరే
కార్వాచీనతటీ సమాగత సముద్యత్తుంగభంగార్భటిన్. 51

మ. తాపార్తుండగుజాతవేదుఁడునుదగ్గంగానదిం జేరి సం
తాపంబేదఁగమున్గితజ్జలమునన్ దాహాత్మకంబైన య
క్కాపాలేంద్రియమాహరింప నదినిష్కాలుష్యుఁడై స్థైర్యమున్
దోర్పన్ వచ్చిన యట్లపోయి కడుసంతోషంబునందె న్మదిన్.

మ. నలినాక్షాంఘ్రి సరోజసంభవ శతానందీయకుండిస్థ యా
నల నాకాపగయున్ సహింపఁగ నశక్యంబౌ వ్యథంబొందెఁ ద
జ్జ్వలనప్రోజ్ఝిత సంక్షయావసర దీవ్యద్ధవ్యవాట్కీలికా
తులనాకాభవవీర్య సంక్షుభిత యాదోవీతవాహోధ్యమై. 53

తే. గీ. అంతటనినుండుతో తెంచు నటకుమున్న
మాఘసుస్నాన మాచరింపంగ నెంచి
యతిమనోవేగమగు వియద్గతి తలిర్ప
నారుగురు కృత్తికలు నటకరుగుదెంచి. 54

సీ. శుభ్రతరంబులు నభ్రంకషములైన
కల్లోలశతములఁ గాంచునట్టి
వారికి నవగాహపరులకు నాచమ
నముఁ జేయునట్టి పుణ్యప్రవరుల
కింద్రలోకముఁ జేరనిదియ మార్గంబని
చెప్పుచున్నదివోలె చెలఁగుదానిఁ
దానమాడిన మునితతి బలికర్మల
కుచితంబులగు గుసుమోత్కరముల

తే. గీ. తోడ దూర్వాక్షతంబులతోడ మంద
మారుతముతోడ పాదపమాలతోడ
హంసములతో కుటీరగృహములతోడఁ
జాలతలొప్పొందు విస్తృత వేలదాని. 55

తే. గీ. మంచుమల యల్లునకుఁ దలమలగు నెద్ది
యరయుమాత్రాన దురితంబులడఁచు నెద్ది
వెన్నుని పదాంబుజంబున వెలసె నెద్ది
యట్టి గంగాతరంగిణీ నరసివారు. 56

ఉ. ఔదలలింతవంచివినయంబున వందనమాచరించి య

త్యాదరమొప్పఁదజ్జలమునందువగాహమునుంబొనర్చి వా
రాదటమంత్రపూర్వకములైనవిధుల్విధియించిమెంతయున్
మోదమునందిరందరునపూర్వములౌతమనోములెంచుచున్.

క. భరియింప నశక్యంబగు । హరవీర్యమమోఘమప్పుడార్వి
గర్భాం । తరములను సంచరించెన్ । సురనిమ్నగఁదాన
మాఁడఁచొచ్చిన కతనన్. 58

క. ఉద్యత్కృశానుకల్పము । నద్యుజ్ఝితమైన యమ్మనస్సద
నద్వి । ద్విద్యుద్దీప్రజముచే । సద్యోగర్భంబునయ్యెఁ జా
నలకెల్లన్. 59

తే. గీ. దుర్భరంబగుదాహ్యదోద్భూతిఁగాంచి
సుజ్ఞలాకృత్తిక లెఱింగి శోకవహ్ని
తప్తమానసలైరి తత్క్షణమునందు
భర్తృభయమునహ్రీభయభరమువలన. 60

తే. గీ. శరవణంబందుదద్గర్భజాతములను
సిగ్గుతోనుంచివారేగఁజిత్రభాను
కోటివిభ్రాజమానుఁడైకొమరుఁడపుడు
మోములారింటితోనొక్కమూర్తియయ్యె. 61

ఆ. వె. పాకశాసనాది నాకౌకసులచేత
యాచమానయగుచు నా సురనది
యమృతపూర్ణమైనయట్టి చన్గవఁబ్రీతిఁ
గుడిపెశిశువు మూర్తిఁ గొనుచువచ్చి. 62

తే. గీ. ఆతఁడును దత్కుచామృతాహార మాని
యాని యాక్షణమ సమేధమానుఁడగుచు
దివ్య మతిహృద్యమా నాకృతినిధరించి
మహితషట్కృత్తికాసేవ్యమానుఁడయ్యె. 63

మ. కనదానందజ బాష్ప సంకలితగంగా వహ్నిషట్కృత్తికల్
శనయుక్ దివ్యుని వానిఁగొంటకువివాదంబాడుచుండంగఁదత్
క్షణమం దద్రి సుతావిహారపరుఁడై స్వాంతాతివేగంబునై
న నభోయానము నెక్కి శంకరుఁడు కానన్వచ్చెనచ్చోటికిన్. 64

ఉ. ధరణి ధరాత్మ జోడుపతిధారులు నప్డు నిసర్గవత్సల
త్వరసవశప్రవృద్ధ నిజభావ సమాశ్రియహర్ష నిర్గల
త్సురుచిర బాష్పవారి కణశోభితలోచన పంకజాతులై
యరసిరియాదరంబున షడానను షడ్డిసజాతమాతృనిన్.

తే. గీ. ఎదుటఁగనఁబడు నీశిశు వెవఁడొకొయితని
బుత్రుఁగాఁగన్న యాధర్మమూర్తి యెవఁడొ
భాగ్యవతులకు నవతంసభావమంది
యితని నెవ్వతెక నెఁ దెల్పవే మహాత్మ. 66

తే. గీ. స్వస్తరంగిణి యీమె పావకుఁడితండు
వీరె కృత్తిక లేలకో పోరుచున్న
వారు నాపుత్రుఁడితఁడు నీవాఁడుకాఁడ
టంచు మోహములవైలక్ష్య మంకురింప. 67

క. వీరలలో నొక్కరిదో। మో రవిశశిలోచనా! సురోరగ

సిద్ధా । వారంబుల కొలముఁలో । నేరిదొకో యీయపత్య
మృతమెయ్యదియో. 68

వ. అని కౌతూహలమొప్పఁగాఁబలుకునయ్యబ్జాక్షిపల్కాలకిం
చి నిశానాథకలావతంసుఁడు దరస్మేరంబు తల్కొత్త నా
ననమందుఁ బ్రమదాహృదబ్జమున కానందామృతంబీయఁ గా
రణమానొక్కమృదూక్తిఁబల్కెనిటులారాకేందుబింబాస్యతోన్

సీ. కమలాక్షి! యితఁడు జగత్త్రియానందుండు
వీరమాత!భవత్కుమారుఁడితఁడు
కళ్యాణి! కల్యాణకరుఁడు వేల్పులకెల్ల
నీకంటె వేరగు నేకృశాంగి
వలన నిట్టిసుతుండు పుట్టిభవించుఁ బార్వతి!
భువనమంగళమూర్తి పుత్త్రిఁడితఁడు
నీకుమారుఁడుసుమ్ము నిక్కము రత్నాక
రమ్మర్హమగుఁగాదె రత్నమునకు

తే గీ. విను మనలమున నాచేత విడువఁబడిన
వీర్యమంతయుఁ గంగలోవెలసె నవ్వ
డచటమున్గుటఁ గృత్తికలందుఁ జేరి
గర్భతనుఁజెందఁగా నమోఘమునుదాని. 70

క. వారలును శరవణంబున । కూరిమితోనుంచ భువనకోటికి
మోదం । బారఁగ నిడు నీయుత్సవ । మీరహి సంసిద్ధమ
య్యె నిందునిభాస్యా! 71

చ. సకలజగత్ప్రియంకరుని సత్సుతునింగనుటన్ సుపుత్రిణీ
నికరములోన ధుర్యవన నీవొకదానివెకాన వీని ను
త్సుకతతలిర్ప నంకతలశోభితుఁజేయుమటంచు శీతరు
ట్సకలధరుండుపల్క-హిమశైలతనూజయుసంభ్రమంబునన్

క. వినుతించు చున్నవారలఁ
గనక కనకశైలచాపు కామిని సుతునిం
గనఁబోయె నేయువిద యిలఁ
తనయోత్సవమత్తకాదు తలపోయంగన్. 73

మ. నమదబ్జాతజపూర్వకత్రిదివజన్మస్తోమ పృష్ఠాంతికం
గములౌ పాణిసరోరుహంబుల సుతుం గాఢాముమైతీసి యా
హిమభూభృత్సుత నూతనాభ్యుదితపూర్ణేందుప్రకాశంబు నం
కమునన్ జేరిచి లాలనంబొనరిచెన్ గాఢానురాగాత్మయై. 74

క. జగదేక మాతయగు న
య్యగసుతచన్గుడిచెఁ గృత్తికానలగంగా
పగ లరుసంబునఁ దనుగాం
చగ వడిలోనుండి కొమరసామియుఁ బ్రీతిన్. 75

ఆ. వె. మేరుశిఖరితట సమారూఢవల్లరి
కనకఫలముచేత గంగ ఫుల్ల
వారిజంబుచేత వలె శైలపతిపుత్రి
కొమరుఁజంకనుంచి కొమరు మిగిలె. 76

క. ఆనందబాష్పసంపూ

ర్ణాననమున హారకళత్రి మాషాడ్వదనై
కానూన నాళసంభవ
పానీయజపంచకరమఁ బల్మొద్దుఁగొనెఁ. 77

ఉ. అట్టులు మాటిమాటికిసుతాస్యముముద్దులఁగొంచునంతటన్
బట్టినిజంకఁ బెట్టుకొని పర్వతకన్యక ప్రీతచిత్తుఁడై
నట్టిశశాంక శేఖరుని హస్తమునూతముఁగొంచు నెక్కెఁదా
మట్టియలింతమోగ్రియఁగ విమానవరం బతివాతవేగమున్

మ. అతివేలప్రిమదప్రిరూఢ పులకవ్యాసంగవిభ్రాజిత
స్వతనుండై హరుఁ డీక్షణామృతసరిత్సత్రింబుఁబుత్రిం బవి
త్రితరున్ స్వాంకమునందునుంచుహిమగోత్రాభృత్సుతంగాత్రసం
శ్రితఁగాఁజేయుచుఁబోయెవేగమున దారిన్మించుచుంగొండకున్.

వ. ఆచందంబున నయ్యిందుశేఖరుండు పుత్రికళత్రి సహితుండై నికామరమ్యంబును నిజధామంబునగు రాజతాచలంబుఁజేరి యప్ప్రిమథాధిపుండు పృథుప్రిమోద సాదరసంకాశ సమాయాతంబగు గణసమూహంబు నవలోకించి తుషారగిరికన్యకాతనయజన్మోత్సవంబొనర్పఁ దగువారి నియోగించిన

ఉ. తచ్ఛరజన్మజన్మ మహతత్పరతన్ బ్రిమదాళి నొక్కఁడుం
డచ్ఛతరామరద్రుమ సుమావళి సంచితముల్ స్ఫురన్మరీ
చిచ్ఛురితాంబరంబులు విచిత్రిములౌ మణితోరణాల నో
ష్ణచ్ఛలిఖండమాళి గృహసంచయమందు నమర్చె వేడుకన్.

క. పటహమును గొట్టె నతిలం

పటమతియై యొక(—)డు తదభంగురరవమ్ములన్
పటుగతిఁబోయి దివంబున
నిటలవిలోచన తనయ జనిమహము( దెలుపన్.

ఉ. ఆవిభవంబునందుఁ మహినాద్రిసుతాహృదయాంబుజాతసం
భావితలౌచు(గిన్నరులభామలు గింపురుషాంబుజాస్యలున్
దైవతకాంతలున్ గడుముదంబున నాగృహమందుఁజేరి సం
భావనమీర మైమరచిపాడిరి మంగళగీత జాతముల్. 84

క. నానాపరికారతూర్య
స్వానంబుల కనుగుణముగఁ బాటలమరఁగా
నా నాకవారకామిను
లానందము నిడెడిరీతినాడి రనుమతిన్. 85

ఆ. వె. సౌఖ్యకరములైన చల్లనితెమ్మెరల్
వీచె నాశలెల్ల విశదలయ్యె
విగతధూముఁడగుచు వృద్ధినందెఁగృశానుఁ
డమలమయ్యె సలిలమట్టివేళ. 85

తే. గీ. మంగళోపాయనపుపాత్రిముం గరములఁ
దాల్చిమాతలు తల్లిచందమునవచ్చి
కొమరుశిరమున దూర్వాక్షతములనునిచి
యంకమునఁజేర్చి రాగిరిజాత్మభవుని. 86

తే. గీ. అట్లు గిరిజా గిరీశసుతా భ్యుదయమ
హోత్సవము పూర్తియయ్యె మహోజ్వలముగ

జంగమస్థావరాత్మకజగము పొంగెఁ
దారుమారయ్యెఁ దారకేంద్రారిలక్ష్మి. 87

తే. గీ. అంత మోదనిదానంబులైనచిత్రి
బాలలీలాలలితముల బాలకుండు
హరగిరీంద్రసుతాహృదయములఁ దనిపె
బాలకేళులు ముదమునీవా తలంప. 88

క. భూతపతియుఁ గిరిసుతయు న
జాతదంతములును మోదజనులునగుఁదనూ
జాతుని షడ్వదనాంభో
జాతంబుల ముద్దుఁగొనిరి చయ్యనవరుసన్. 89

తే. గీ. స్ఖలితములు నస్ఖలితములు గంపయుతము
లప్రకంపంబులైన వాక్యములచేత
పలుకుపలుకున నమృతంబులొలుకుచుండ
పితరుమనంబుల నిగురు వెట్టఁజేసె 90

ఉ. అపగతహేతుహాసకలితానన పూర్ణశశాంకమండలుం
డపుడు గృహాంగణంబున విహారముసల్పుచుఁ దద్రిజఃకణా
ళిపరిగతాంగుఁడై మహితలీలల నర్థమెరుంగ రానియ
ట్టి పలుకులన్వచించుచుఁ గడించెను తల్లికిఁదండ్రికిన్ స్పృహన్.

మ. ఒకమారారాహరసూతిబల్మిమెయిఁజేయున్ వాహనోత్తుంగశృం
గకకర్షంబు మరొక్కమారు జననీకంఠీరవోద్యత్సటా

నికరంబుఁ గ్రహియించిలాగు భయమింతేలేకయొక్కొక్కమా
రెకసక్కెమ్ములఁబల్కు భృంగిరిటినయ్యా శుల్ముదంబందఁగన్

తే. గీ. ఒకటి నాలుగు పది పదునొకటి మూఁడు
తొమ్మి దేడైదటంచు మృత్యుంజయుండు
మెడకుఁజుట్టిన పాముల మెడలఁబట్టి
కోరలగణించు గుహుఁడు భీదూరుఁడగుచు! 93

తే. గీ. తండ్రిదాల్చిన పుర్రెల దండలోన
వ్రేళులందూర్చి వానిలో వ్రేలునట్టి
దంతములఁగాంచి ముత్తెంపుదంతురంబు
లని తలఁచి వానిఁగొన నందు నతిరభసము. 94

తే. గీ. సామిభంగురకంధరు శంభుజడల
క్రిందుగాలాగి పార్వతీనందనుండు
కౌతుకంబున శిరమునఁ గ్రాలుచున్న
యిందుఖండంబు ముద్దాడు హేలగాఁగ. 95

వ. ఆప్రకారంబున శిశుప్రవరుండగు కుమారుండు
శైశవావసరప్రవర్ధమానంబులును సాంద్రానందసంధాయకం
బులును లలితలలితంబులునగు నాటలచేఁ దల్లిదండ్రుల
యుల్లంబులఁ బల్లవింపఁ జేయుచు నమ్మల్లుం డారవరోజుననే
జనకువలన విలువిద్దెల నభ్యసించి సకలశస్త్రాస్త్రవిద్యా
పారంగతుండై యుల్లసిల్లుచుండె ననుటయు. 96

ఉ. శ్రీరమణాంఘ్రి పంకరుహ సేవనతత్పరమానసా! బుధా
వారవరా నయైకధన పావనమార్గ సదాదరా కామాం
ధూరుమహాన్వయాంబుధిమనోహర సాత్త్విక చంద్రమా సదా
చారవిహార సంగ్రథితసత్కృతి రాజసముల్లస ద్యశా. 97

మాలిని. విగలితకలిదోషా విజ్ఞలోకైకభూషా
సుగుణమణినిధానా శుద్ధబుద్ధిప్రధానా
జగదధిగతకీర్తీ సాధుమార్గానువర్తీ
నిగమవిధివినోదా నిత్యనీరంధ్రమోదా. 98

క. అమృతమయనయన కమలా
రమణార్చాచరణ సుగుణరత్ననిధానా
నమలినకీర్తి విశాలా
కమనీయనయాలవాల కవితాలోలా. 99

గద్య:—ఇది శ్రీమద్బాలాత్రిపురసుందరీ ప్రసాదాసాది తానవద్యకవితా యోగహృద్య భారద్వాజగోత్రపవిత్ర మహితాపస్తంబసూత్ర లక్ష్మీనారాయణ యజ్వపుత్ర గురుజనాశీర్వచనపాత్ర విజ్ఞజన విధేయ యజ్ఞనారాయణ నామధేయ ప్రణీతంబగు కుమారవిజయం బను ప్రబంధంబునఁజతుర్థాశ్వాసము

---

# కుమారవిజయము.



## పంచమాశ్వాసము



క. శ్రీమత్కల్యాణగుణ
స్తోమ నితాంతాభిరామ సూరిలలామా
ధీమదవ్వర రామానుజ
నామ వివేకాతివినయ నయ పరధామా. 1

వ. ఆకర్ణింపుము. 2

క. అంధకసింధురముఖ గ
ర్వాంధతమస శీతభాను నతివేలదయా
సింధు శివుఁ జేరి రమరులు
కంధరమునుఁజేరు చాతకంబులఁ బోలెన్. 3

శా. దైతేయాతిఖలీకృతాత్ముఁడగు సుత్రాముండు దేవాళితో
శీతక్ష్మాధరకన్యకేశపదరాజీవ ద్వయీన్యాససం
పూతంబౌ రజతాద్రిఁజేరి యచటంబొల్పారుచిత్రంబులన్
జేతోమోదమునందుచు న్దరిసె నాశ్రీకంఠుగేహంబటన్.

క. చంచన్మణిగణ సంచిత
కాంచనమయవేత్రదండ కలితకరుండై
మించెడి నందీశ్వరుఁ డే
తెంచి యమరనాథుఁగాంచి ధృతసంభ్రముఁడై. 5

ఉ. ఆతనిఁ గారవించి వినయంబు తలిర్పఁగ నందికేశుఁ డ
భ్యాగతపతింగనుంగొని విభూ! భవదీక్షణకాంక్షియై సుర
వ్రాతముతోఁ బురందరుఁడు వచ్చినవాఁడని విన్నవించి య
న్నేత యనుజ్ఞ చే నపుఁడు నిర్జరనాథునిఁ లోనికన్పెనర్. 6

తే. గీ. చండభృంగ్యాదిగణ గరిష్ఠవ్రజంబు
కొలువ సింహాసనంబునఁ గూరుచుండి
భానుకోటిసమప్రభాభాసమానుఁ
డగు శివుంగాంచి రా వాసవాదిసురలు. 7

వ. వెండియు నఖండపరశుం డుద్బంధన నిర్దిష్ట వేష్టి
తోల్లసల్లేలిహానవరఫణాతలవిరాజమాన మాణిక్యకాంతి సం
తానసమ్మర్ద కపర్ద నిర్దిశ్యమానపరిశుద్ధేద్ధధాతుపూర్త కార్తస్వ
ర ధరణీధర తుంగ శృంగోపమానుండును, వికటపాటలజటాట
వీసముద్ఘాటన పాటవసముజ్జృంభమాణ తుంగ తరంగసం
ఘ లసమానతూలసమాన ఫేనకైతవ హాసిత నిజాంకతల గౌరీక
గంగాపగుండును, రతిరమణ భస్మసాత్కరణకరణ విలయసమ
య సముదితదహన మహనీయకీలాకలాపకీలిత లలాటనయనుం
డును, ధరణీధరరాజకన్యకా కుతూహలబద్ధనీలమాణిక్యమయ
కర్ణికాశంకాకర వినీల విభావిభవ సంబంధ బంధుర కం
ఠోపకంఠుండును కాలార్దిత సురాసురగరుడ గంధర్వసిద్ధ సా
ధ్యకిన్నర కింపురుష విద్యాధర ప్రముఖ నిఖలబర్హిర్ముఖచితా
భస్మసరికరపరిపాండురిత శరీరలక్ష్మీతిరస్కృతతుషారాచల సు

శ్రీకుండును, సురాస్థిమాలాభరణుండును, రణాంతమూలత్రి
శూలకీలిత కరుండును, నిజమకుట కోటిఘటితేందు కలావర్ష
దమృత ధారాప్లావన లబ్ధ సంజ్ఞా సముదిత వేదోచ్చారణ చణ
బ్రహ్మకపాల మాలాలంకృత కంధరుండును గజాసురవధూ
వైధవ్యసంపాద కానన్య సామాన్య పినాక ధనుష్కీలిత
కరుండు, ననర్ఘమాణిక్యభంగీ చిత్రిత కంఠీరవాసన సము
పవిష్టుండును, జంద్రమరీచి గౌరచామీకర వీజ్యమానుం
డును,సమస్తగణ విస్మయావహ శస్త్రాస్త్ర విద్యాభ్యాసావసక్త
కుమార సాదర ప్రసారిత దృక్కలాపుండును బార్వతీమోద
జనకాలాపుండు, నగు నప్పరమేశ్వరుఁ బొడఁగని. 8

ఉ. వేయివిలోచనంబులను పేరిటి తామరపువ్వ్వుతేకులం
గాయజశాసను న్వినయ గౌరవ మొప్పఁగఁగాంచు యజ్ఞభు
జ్నాయకుఁడుల్లసిల్లె సుమనఃప్రకరంబులచే వికీర్ణమ్మున
శ్రీయుతమైన యామ్రధరణీరుహవర్యమునాఁగ నెంతయున్.

కం. స్వకమకుటకోటి సంచ్యుత
వికసిత మందారకుసుమ వితతపరాగ
ప్రకరము శివుపాదంబుల
కొక వింతనొసంగ నింద్రుఁడునిచె శిరంబున్, 10

ఆ. వె. స్వర్గవంద్యుఁడైన శక్రుండు త్రైలోక్య
వంద్యుఁడైన శివునిపాదములకు
మ్రొక్కి యతిపవిత్రమును పరమమగు కృ

తార్థభావపాత్ర మగుచు నొప్పె. 11

కం. కనకక్ష్మాధర ధీరుఁ
ఘనశస్త్రాస్త్ర ప్రచారుఁ గాంచెఁ గుమారున్
జనకాంతిక సంచారుఁ
దనుజజయేచ్ఛయును బొందె ధరణీధరారిఁ.

శా. దేవా! వీఁడె నమస్కరించెడిని నీ దివ్యానుకంపామృత
శ్రీవర్ధిష్ణుసువైభవుండనుచు శేషీభూత గీర్వాణులున్
దేవేశాను నమస్కరించిరొగిఁ బ్రత్యేకంబుగాఁ బాదపీ
ఠీ విన్యస్త శిరస్కులై యసురనీడేర్పంగఁ బ్రార్థించుచున్

తే. గీ. అప్పు డద దయదలుకొత్త నా హరుండు
గణసమానీతమును మణిఖచితమైన
యాసనంబున గూర్చుండ నానతినిడి
యింద్రమునకు నెల్లరంగని యిట్లులనియె. 14

సీ. బలరిపుప్రముఖ దేవతలార! భూరి ప
రాక్రము లీవరవరాయుధాఢ్యు
లైన మీమోముల నధికదైన్యంబు క
న్పట్టె మీసుకృతంబు ప్రబలమైన
దైన నిబ్భంగి రాజ్యంబును గోల్పోయి
యిటులేల పటుమానమేద మేది
నీస్థలినుంటిరి? నిజమువచింపుఁడ
హార్యధైర్యులరు మీయనుపమాజ

తే. గీ. మెవరికతమున గోలుపోయితిరి చిరస
మార్జితంబైన పరమపుణ్యం బొకండు
పొరపడుటచే గతించినపోల్కి నెవఁడు
మీ కనీదృశదశలను సోకఁజేసె. 15

తే. గీ. అట్టివాఁడెవ్వఁడైన నున్నట్టులైన
నేనతఁగువాఁడ నానీచునిం జయింప
వనముల దవానలవిపత్తి నడఁచుపనిని
వారిదముఁదక్కఁ దక్కినవానివశమె? 16

కం. అనిపలుకు సమ్మహాత్ముని
యనుకంపార్ద్రింబులైన యాలాపములన్
విని మోదంబున నశ్రులు
కనులలమఁగ మోములందుఁ గళఁగనిరి సురల్. 17

క. అమరేశ్వరు డపు డంగజ
దమనునితోఁ బల్కెనిట్లుతాత్పర్యమునన్
సమయోచితవాక్యంబులు
సమధికఫలమొసఁగుఁగాదె జగతి నరులకున్. 18

మ. నగకన్యాహృదయాంబుజాతపదవీనందన్మహాభృంగరా
జ! గజేంద్రాసురనాశకార! చతురాస్యప్రాపితాభీష్టుఁడై
జగముల్ వేచుచుఁ దారకుండ నెడిరక్షశ్చక్రిశకుండు మా
కగచాట్లంగలిఁగించు నెంచుచు మనంబందున్ దృఢాగ్రంబుగన్

క. ఆబాధలఁ బడఁజాలక

బాబూ! మేమందఱమును బరమేష్ఠిఁ గనం
గాఁబోయినఁ దొలి నాతం
డీ బహుదుఃఖితులఁ గాంచి యెద దయకలుగన్

ఉ. బాలశశాంక శేఖరు నపత్యము సర్వచమూపరిధానమై
వేలుపులార! తారకుని విశ్రుతదానవుఁ జంపివైచు ముం
దాలమునందటంచుఁ గరుణాలయుఁడై వచియించెఁగాన ని
ర్భాలుఁ జమూపతిన్నలిపి పాలనసేయవె లోకనాయకా!

సీ. త్రైలోక్యలక్ష్మి ద్విత్తాభూరిశల్యుఁడౌ
తారకుం డనిఁ గడతేరుఁగాక
విధవలౌ దైతేయవధువుల యేడ్పుల
రొద దిగంతంబులఁ బొదలుఁగాక
చెఱసాలలోనున్న సురకామినులకెల్ల
విడుదలకల్గి పెంపడరుఁగాక
నందనోద్యానభూ నంద ద్రుమ సందోహ
మందంపు మందిరం బగునుగాక

తే. గీ. భవ్యపరిపాలనాది వైభవము లేక
పాడువడియున్న స్వర్లోకభవనరాజ
రాజి రాజీవనేత్రలు రాజిలంగఁ
జూచెదముకాక నీదయ శూలహస్త! 22

మ. అని దేవేంద్రుఁడు పల్కఁగావినిసుమాస్త్రారాతి తత్తారకా
ఖ్యనిశాటాధిప దుష్టచేష్టిత వివృద్ధామర్షుఁడై వేల్పులం

గనిపల్కెన్ సురలార! పూర్వము ప్రసంఖ్యానైక ముఖ్యుండన
య్యనఁ బెండ్లాడుట గౌరి నందులకుకాదో రాక్షసాంతార్థమై.

కం. మాయిద్దరకు జనించిన
యీ యనఘుఁడు దారకుని జయించి రణమునం
దాయతమగు స్వారాజ్యము
నాయత్తముఁ జేయుగాక యమరవరునకున్. 24

కం. తనయా! నీవత్తారకు
నని గెల్వుమటంచుఁ బల్కనా పల్కెఁదుర్గ
వినతుండై కైకొనెను పి
తృనియోగము ధర్మమగుఁగదే తనయులకున్. 25

తే. గీ. అసురయుద్ధ విధానంబునందు నితఁడు
దుర్జయుండంచు నిష్టపుత్రునిఁ బొగడఁగ
శివుఁడు మనమున ముదమును జెందె గౌరి
వీరసుతుఁగాంచి పొంగదే వీరమాత. 26

మ. బలవదారాతిసవీరవారవనితా పంకేజపత్రోపమో
జ్వలనేత్రద్వయురంగ దంజన వినాశప్రాప్తిసంభూతునిన్
గలితాస్త్రున్ జగతీశరణ్యుఁద్రిజగత్కళ్యాణదుం బొంది మ
త్తిలిరావేల్పులెవండు పొంగఁడుధరిత్రిన్ బూరితాకాంక్షుఁడై

సీ. అంతటఁ జైత్రప్రయాణోచితంబగు
చారువేషముఁదాల్చి షణ్ముఖుండు
జనకుపాదములకు జననీపదములకు

వందనంబు లొనర్పభక్తిపరత
వత్స! లోకత్రియభయదుఁ డౌవరశత్రుఁ
దారకాసురుని నే త్రిస్మితంబు
తోవచ్చుబాణాళితోడనే నిర్జించి
నాకరాజ్యమునిందు్రినకు నొసంగి
తే. గీ. భూరి యశముందుదువుగాక మారులేక
యనుచు దీవించి కౌగిలులందుఁ జేర్చి
రుభయు లానందజలబిందు వొక్కటొకటి
శిరమునంబడ వీరాభిషేకమట్లు. 28

వ. అంత నక్కుమారుండు నిజవాహన సమారూఢుం డై పాకారి ప్రముఖ నిఖిల బర్హిర్ముఖులు వెంబడిఁబడిరాగ నాక లోకావలోకన కౌతుకసమాకీర్ణ మానసుండై పితరులకుఁబ్రదక్షిణంబుగా నంబరంబున కెగసి వేల్పుల నడుమనుండి చుక్కల నడుమ నెక్కొని యున్న చుక్కలరాయని చక్కదనంబుఁ దక్కువచేయుచుఁ జని ముహూర్తమాత్రింబున నాకలోకంబుఁ డగ్గరి యాసురత్రాసవశంబున లోనికిం బ్రవేశింపఁ గంపించుచు మీరు ముందరన మీరు ముందరని సందడిచేసెడి బృందారకుల సందేహంబుల డిందు పఱచుచు నాతారకుం డరుదెంచె నేని నాశరంబుల కిచ్చుటనే తదీయ శోణితంబులచే బాణగోష్ఠిఁ జరుపుదునని ప్రగల్భాలాపంబులు పలుకుచు నారదాది దివ్యర్షులు స్వస్తివాచకంబులు వలుకుచుండ సిద్ధసాధ్యులు జయేతి

వాక్యంబు లుచ్చరించుచు నుత్సాహంబు రెట్టింపఁ జేయ నమ
రతటినిఁజేరి ప్రణామపూర్వకంబుగాఁ దత్తటినీతరణంబొనర్చి
తరంగరంగత్కంజాత సంజాత పరిమళమిళితంబగు మందప
వనంబు చెక్కిళులపైఁ గ్రమ్మిన చిరుచెమ్మటల తెమ్మవాపుచు
సేవించుకొన నడచుచు ముందర పురందరు లీలావనంబగు నందన
వనంబు నాలోకించి యవ్వల సిరులఁ గోల్పోయి శరణ్యరహిత
మై దైన్యంబుదియున్న యన్నులమిన్న కెనయగు నన్నాకనా
యకరాజధాని నిరీక్షించి మనంబున గరుణచెంది మహోరగ
నిర్మోకనిర్మిత పిధానంబులగు జాలపథంబులుగల సౌధంబు
లను, తమ్ములఁ గోల్పోయి వైదూర్యంబులకు విదూరం
బులై యేవంకఁగనినఁ దృణాంకుర సంకులంబులైయున్న
దిగుడు బావులను దారకదైత్య దంతావళ దంత సం
ఘట్టన సంజాతక్షతంబులగు కుడ్యంబులు గల వైజయంతంబు
గని మనంబున నద్దానవుపై రోసంబు దీపింపఁ దత్సౌధంబునఁ
బ్రవేశించి యచటనున్న సురాసురకులాది పూరుషుండగు కశ్య
ప మహర్షిఁగని భక్తివిశ్వాస పరవశుండై వానికిఁ దద్ధర్మ
పత్నికి సమస్కరించి వారివలన శుభాశీర్వచనంబులఁ బడసి
పౌలోమి మొదలగు దిక్పాలకలీలావతులచే లాలితుండై
సప్తమాతృకా సంభావితుఁడై యనంతరంబ మహోత్సాహం
బునఁ బ్రయాణభేరి వేయించి. 29

క. పవమాన మానసోభయ । జవభంగీసముపదేశ చణముల

గు హాయ। ప్రవరములూనిన రథమును। శివతనయుండెక్కి చని
యెం జేవదలిర్పన్. 30

మ. అని జేయన్ జను వేళ దాల్చుటకు యోగ్యంబైన వేషంబు గై
కొని ధాత్రీధర పక్షమండల భిదాకూరంబు వజ్రాయుధం
బును గేలన్ ధరియించి రౌప్యగిరి నాఁబొల్పారు నైరావతం
బునధిష్ఠించి కుమారు వెంటనడచెన్ భూమీధ్రశత్రుండొగిన్

క. ఆతని వెన్గొనినడచెను। జాతవేదసుండు మేషసమధిష్ఠితుఁడై
భీతికరాయుధవర సం। స్ఫీతకరుండగుచు యుద్ధవేషముతనరన్.

మ. హరినీలోపమచండ విగ్రహము శృంగాగ్రప్రహారక్షతాం
బరసంచారిపయోధర వ్రజము దుర్వార త్వరాయుక్త సం
చరణంబౌ నొకసైరిభంబు వహియించన్ వహ్నికిన్వెన్నునం
టి రయంబొప్పఁగ నేగె నంతకుఁ డకుంఠీభూతదండాఢ్యుఁడై.

క. నూతనసముదిత ఘనశో। భాతతి వృతదేహుఁడైన వరుణుఁడు
మకరా। స్వీతుఁడయి వాని వెంబడిఁ। జేతోవేగంబున నడచెను
రణకాంక్షన్. 34

తే. గీ. పవనుఁడును నైఋతియు యక్షపాలకుండు। నల్ల యీ
శానుఁ డెంతయునుల్లసిల్ల। నల్లములు రణకాంక్ష నాయుధ
ములూని నడచి రందఱు వరుస సన్నాహమొప్ప. 35

ఆ. వె. కాద్రివేయబద్ధ ఘనజటాభరులయి। కేలఁదాల్చుచున్
ద్రిశూలములను। హిమనగములఁబోలు వృషములధిష్ఠించి
రోసమొప్పఁజనిరి రుద్రులెల్ల. 36

సీ. కమనీయరుచి లసత్కాంచన ధ్వజదండ సందోహసుంద
రస్యందనంబు! నూర్ధ్వపరిసారితాలోప మోజ్వలకర స్తోమ
విభ్రాజి సత్సామజంబు! శాతరింఖాక్షుణ్ణభూతలోత్థితరజో
రాజిరాజితవాజిరాజగణము! నిజవైరిఖండనోన్నిద్రదివ్యా
యుధ వారితసంస్ఫీతపదాతిచయము!
తే. గీ. స్ఫుటభటాహత పటహాది కృతవిపాట! నాతిపటు క
నత్వ నిశాటవర వ!ధూటినీ గర్భనిర్భేదనాటదలి ని!నాద
భీషణమగుచు సైన్యంబుకదలె. 37
తే. గీ. వేల్పుబలములలోనుండి వెడలునట్టి! భూరికోలాహల
ములచేఁబూర్ణములగు! పృథివి నాకసమున దిశావితతియందు!
నంతరంబింతయైనలే దట్టివేళ. 38
క. తారక లక్ష్మీచాలన కారణములు భూనభోఽన్తకకుబంత
ర సం! చారణములైన వరపట!హారవములు చెలఁగెఁ గద
లునట్టి క్షణమునన్. 39
కం. రథహయ ఖరఖుర ఘట్టన! శిథిలితపృథివీరజము విస్మృమ
రంబగుచున్! బృధుకరి కర్ణములవియ!త్పథమున వ్యాపిం
చి కనులపండువగూర్చెన్. 40
ఉ. కాంచనభూమిభాగముల గంధగజేంద్రము లాత్మబింబము
ల్గాంచుచు నగ్రభాగముల గ్రక్కునఁ జిత్తములందురోసము
ల్పెంచి దురంతదంతములఁ బృథ్వినగల్చును బృంహితధ్వను
ల్మించ రసాతలాగతవిమేదుర నాగముల న్భ్రమింబునన్.

వ. ఆచందంబున నబ్బృందారక సైన్యంబు లగ్గిర్వాణశిఖరిశిఖర భాగంబున నంబికాతనయ పురోగమంబులై తమలోఁ జెలఁగు కోలాహల రవంబులును నిర్దయభటపటల సమాహన్యమాన పటహ మహానినాదంబులును, మాతంగ సంఘ ఘీంకారధ్వనులును తురంగమ హేషాఘోషంబులును మొత్తంబయి తద్గిరి గుహాగృహకుహరంబులఁ బ్రవేశించి ప్రతినాద మేదురంబులై యచట నిశ్శంకంబుగ నిద్రించు కంఠీరవంబుల మేల్కొలుప గుల్మంబుల బెట్టిదంబులగు గిట్టల సంఘట్టనంబులవిపాటితంబగు భూతలంబునుండి రేగిన పరాగంబులు నభోగంబులై యర్కాచ్ఛాదకంబులై యభ్రభ్రమణ విభ్రమంబులూని హంసంబుల మానసంబుల మానసంబునొకింత స్మరింపఁజేయుచు మఱొకమారు మయూర రాజంబుల నానంద పూర్వకంబులగు నర్తనంబు లొనర్పఁజేయుచు చెలఁగఁ గాంచన ధ్వజదండంబులు శంపాలతాశంకాసంపాదకంబులుగాఁగ దిగంత దంతావళంబు లశ్వఖురక్షుణ్ణంబగు నతోన్నత భూమిభాగంబు నిజగండ ప్రస్రవ ద్దానాంబుధారా సారంబులఁదడిపి విపుల చరణతలంబుల సమంబొనరింపఁ జనిచని తారకపురము సమీపించి తదుపకంఠంబున విడిసిన 42

సీ. బలవైరి భవతనూభవుని సేనాపతిఁగా నొనరించి సంగ్రా
మమునకు । సకలసైన్యములతోఁ జనుదెంచినాడని యొక
వదంతివిని తారకుని భటులు। మనములొకింత కంపంబుఁ

సందఁగఁ దమ ప్రభునియొద్దకుఁబోయి ప్రణతులగుచు। జం
భాసురారాతిసంగరాకాంక్షియైవిభు! వచ్చినాడనివిన్నవింప

తే. గీ. నసురుఁ డాననమున మందహాసమొప్ప। మూఁడులోకం
బులను వశములను జేసి। నట్టి ననుఁదొల్త నేగెల్వ నాతఁ
డిపుడు శివసుతునిగూడ నను గెల్వచేయునొక్కొ. 43

మ. అనికాకుస్వరమొప్పఁగాఁ బలికియాస్యంబాదుఁగ్రోధంబుఁగై
కొని సేనాపతులంగనుంగొని యనాగోవృత్తిసైన్యంబులక్
షణమాత్రంబున సంగరార్హములుగా సన్నద్ధములేయుఁ డీ
రని వారిన్నియమించి భూరిధనురుద్యత్సాయకోపేతుఁడై. 44

సీ. అతివాతచేతస్త్వరాఢ్యంబు దిగ్దంతి దానద్రవచ్ఛేద దా
యకంబు। కాంచనకింకిణీ క్వాణసమావృత ముజ్జ్వలా
శ్వచతుష్ట యోఘమైన। యరదంబునెక్కి లయాంతకాల
క్షుబ్ధ జలనిధిజాత నిస్వానకలిత। మతిసాంద్రధూళి
సమాక్రాంతరోదోంత। రాళంబునగు సైన్యరాజితోడ

తే. గీ. కదలె నాహన్యమానసంగ్రామపటహ। భైరవరవం
బు దెసలెల్ల వ్యాప్తతముగ। శత్రులమనంబులకు భీతిసంతరిం
చు। దారుణములైన సింహనాదములు సెలఁగ. 45

వ. ఆచందంబున నత్తారకుండు నిజసేనాసమేతుండై
కదలి నడచుచు మధ్యేమార్గంబున నశుభసూచకంబులగు
ననేకదుర్నిమిత్తంబులు సంభవించినను వానిని సఱకు గొనక
సురసైన్యంబులఁ జేరి యింద్రాది బృందారకులందఱు దారక!

యిరువదియొక్కమారు ధారుణిఁగల ధరణిపతులఁజంపి తదీయరుధిరజలంబులఁ గోపాగ్నిఁ జల్లార్చిన జామదగ్న్యునిఁగూడ నతిక్రమించి మించుటమ్ములఁ గ్రౌంచమ్ము భేదించిన యిట్టి రుఁబోరఁగెలువ నీతరంబగునే యని తన్ను నుద్దేశించి పలుక విని కనలి దనుజనాయకుండు కోపంబున మండిపడుచు చేనున్న మండలాగ్రంబు నాఖండలుపై విసరిన. 46

తే. గీ. అయ్యయొ సురేశ్వరునకు ముప్పయ్యె నటకు
నరదముచు బోవనిమ్మని సురలరథులు
సారథుల జీరుచున్ రథసము తలిర్ప
దివిజనాయకుఁజేరి రయ్యవసరమున. 47

శా. ఆభంగిన్ జెరుపందినట్టి సురసైన్యాంభోనిధిన్ సత్వరుం
డై భేదించి మహాసురుండు పవనాహంకారహారిత్వరా
శోభాభావితమైన స్యందనముతోఁజొచ్చెన్ సురస్వాంతసం
క్షోభాపాదక శాతసాయకమిళత్కోదండమార్వీకుఁడై. 48

క. ఆసమయంబున నిజసై । న్యాసురులెల్లరు మహారయంబుతలిర్పన్ ।గా సొచ్చిరి సురసైన్యము । లో సందోదవిన విడ
చెదరో పరు లరులన్. 49

మ. ప్రళయాంభోనిధివోలెఁబొంగి తమపైపైవచ్చునయ్యాసురో
ద్భలసేనల్ గని కంపమందు దివిజవ్రాతంబునుంగాంచియ
మ్మల మన్మండు కృపామృతాంచితసుదృజ్మాలన్ విలోకింపుచున్
జలనంబందకయుండుఁడంచు దమకున్ స్థైర్యంబుఁజేకూర్చినన్.

ఆ. వె. వానిపల్కులవిని వాసవాద్యమరులు
మది౯గలంకవీడి యెదురునడచి
రసురులకు౯ జిగీష సంతటివాని సం
గతి బలప్రదంబు గాదెవనికి? 52

శా. ఆలీలన్ రణసంక్షయంబునకునై యాదిత్యరక్షశ్చమూ
వేలాతిక్రమణోల్లసజ్జలధు లుర్వీమండలవ్యాప్తముల్
హేలాప్రక్రియనొండొకండుకలియన్ రేగెన్మహానాదముల్
శైలోత్తాలతటీవిఘట్టనపటుబ్రహ్మాండకుక్షింభరుల్. 52

వ.అట్టు లవ్వాసవతారకభటు లుద్భటులై పత్తులతోడ బదాతులును రథులతోడరథికులును దురంగస్థులతోడఁదురంగమస్థులును గజారూఢులతోడ వారణారూఢులును దలఁపడి ఘోరంబుగఁ బోరుచు సంభ్రమభ్రమణసంజాతపతాగంబులు మిన్నునకెగసి పర్యాప్తంబులై యొకమారు తమచేవిడువఁబడిన యర్కమండలంబులఁబోలు చక్రింబులతో నొప్పియాకాశ శంకా సంపాదకంబయ్యె మఱియొకమారు వీర సరోష ప్రసారిత ప్రచండమండ లాగ్రంబులచే నొప్పి తటిద్వదనుమితి హేతువయ్యెను మఱొక్కమారు రిపుల వపువులఁ జీల్చివీపులనుండి వెలువడి పుడమిఁబడియు వేగవశంబునఁ బరుగులిడుచున్నవి వోలె నిటునటుఁబ్రసరించు నాభీలంబులగు శూలంబులచే నొప్పి త్రిరసనంబులగు ద్విరసనంబులుసంచరించు నపరపాతాళంబను శంకనంకురింపఁ జేయుచు

నొప్పునప్పురాగంబుకప్పునఁ దమవారనియు నెదిరి వారనియు నెఱుంగనేరక తమ తమ నామంబులనుడువుచు దారుణంబుల గు బాణంబులఁ బ్రయోగించునపుడు పగిలినకుంభంబులనుండి రాలుముత్తియములతోఁబాటు నేలఁగూలుమత్తేభంబులును నారాచాహతంబులై తమకౌతు లదల్చినను నిలువక చెసలకుఁ బారుగుఱ్ఱంబులును శాతాసినికృత్త శరీరులై రక్త ప్రవాహంబులఁ దేలియాడు కాల్బలంబులునుగల్గి యప్పీనుంగులపై గ్రద్దలెల్లెడల సంచరించుచుండ భూతభేతాళంబులు తూర్యనాదంబుల కనుగుణంబుగ నర్తనంబు లొనర్చుచుండ నొనర్పునతిసంకులంబగు సమరంబున నసురసైన్యంబులు విరళంబులగుటయు.

మ. వికలంబై తనసైన్యమెల్లఁ జెదరన్ వేదండకాండంబు లంతకుఁజూడఁ జన గుఱ్ఱముల్ ప్రబలనానా హేతికల్పాంతపావకమందాజ్యముగాఁగఁ దారకుఁడు కోపంబింత దీపింపఁగాఁ గకు బీశానుల మీఁదికేగె నభిరాగచ్ఛన్న నేత్రాంతుఁడై.

మ. వరశైలంబుల నెంతయున్ బ్రచురమైవర్షించువాఃపూర్ణవార్ధరముంబోలుచు దిక్కులన్నియుఁదమిస్రసక్రాంతముల్గాగ నప్పురుహూతానలయక్షునాథశమనాంభో నాయకేశానసైబుతి వాతంబులపై శరాళిఁబరపెఁ హేలా స్మితోల్లాసియై.

క. జంభామితాద్రిదు లవ। ష్టంభము మీరంగ నతని శస్త్రౌఘములన్। దంభోళి ప్రతిమాస్త్రను। సంభారముచే నడఁచిరి సామర్థ్యమునన్.

ఆ. వె. అప్పుడు దేవవైరి యతికోపతామ్రనే
త్రాంతుఁడగుచుఁ బన్నగాస్త్రరాజ
మేయఁ బాములగుచు నింద్రాదులనుఁగట్టి
వైచె నమరవరులు భయమునంద. 57

శా. ఆవాతాశన పాశబద్ధులయి చేయంజాలకున్నట్టి య
ద్దేవేంద్రాదులఁగాంచి షడ్వదనుఁడుద్వృత్తుండుపాశంబులం
బోవంజేయఁగఁగాంచి తారకుఁడు సంఫుల్లారుణాబ్జాతశో
భావాస స్వవిలోచనుండగుచుఁ దానీశాత్మజుంజూచుచున్.

మహాస్రగ్ధర.

స్వకకోదండ ప్రముక్తోజ్వల నిశితశరాసారసంప్లావితారి
ప్రకరక్రోధానలుండై రజనిచర కుల వ్రాతనాథుండు సంభి
న్నకరీంద్రాశ్వాది ఖండోన్నతనత ధరణీ నవ్యసంచారలీలా
తికన చ్చక్రాంగవర్యాధిగతుఁడప్పుడుశక్తిప్రహారున్వచించున్.

సీ. శివసుత! నీవెన్నఁజిన్నవాఁడవు బాహుబలమున్నదని గర్వప
డెదవకట । కదనంబు నెట్లొనర్చెదవు? నిస్సారంబులైన
యీయమ్ములనూని యిప్పుడైన నామాటల నాలించియీయా
నుమిా యత్నంబు మాను యోగ్యంబటంచు । నంతియకాక
యీహారునకు నగతనూభవకును । నీవాక్కుఁ జెవ్రుతనయుఁడ

తే. గీ. పసువుపై నాసయున్న నాసూశుగముల । పాలుకా

కుండ యుద్ధంబుఁ బరిహరించి । సరగున గృహంబునకు
జని జనకునకును । జననికి నమంద మోదంబు సలుపుమన్న.

వ. అనినవిని యక్కుమారుండు వికచ కోకనదారుణ విలోచనుండై చేనున్న కోదండంబు నిరీక్షించుచుఁ దారక! భవదీయ బాహుబలంబుఁ గనియే యుంటి నోపుదు వేని విల్లునమ్ముల నందుకొని మరల నాతోడఁ గదనం బొనర్పుమని పలుక నాతఁడును వికటంబుగ నగి యల్లే యగుఁగాత మని యక్కొమరుపై నిశిత శరపరంపరలఁ బరగింప నాతండును దదీయ శరాసారంబు వారించి వివిధ శస్త్రాస్త్రంబులఁ బ్రయోగించె నట్టులొండొరులు తలఁపడిదారుణంబుగఁబోరుతఱిఁ దారకునినొవ్వఁజేసి కుమారుండు మీఱుటయు నసాధ్యుండని తలఁచి యాపచ్చలితుండై యదృశ్యత్వమంది యొకమారు మారుతరూపంబున సురసైనికుల నెల్ల రథమాతంగ తురంగంబులతోడ మిన్నున కెగరించియచటనుండి క్రిందికిఁబడనైచుచు మఱొకమారు భూనభోంతరాళంబుల నాక్రమించిన గాఢంబగు నంధకారంబుగఁ గప్పట్టి యొండొరుల నెరుంగకుండఁజేసియు మఱియొకమారు కల్పాంతకాలకీలి పోలె నాభీల రూపుండై సైన్యంబులఁ దగుల వెట్టియు మహోపద్రవంబుల నాచరింప నయ్యె యస్త్రంబులఁ బ్రయోగించి యాతని నమాయికు నొనర్చి చేనున్న చాపంబుఁ దునియలొనర్ప నిరాయుధుండై దనుజుండరదంబుననున్న

యాభీలంబగుఁ గరవాలంబుఁ గేలఁ గీలించి కీలెఱింగి యరదంబు
డిగ్గనుఱికి మీఁది కరుదెంచుటయు నప్పార్వతీనందనుండు. 61

క. లయకాల సముదితాధిక। భయదజ్వలన ప్రభాభిభాసుర
శక్తిన్ । రయమొప్పఁగ నత్తారకు।ని యెనురుఱొరొమ్మగ
లనేసె నిర్జరులుబ్బన్. 62

శా. కీలిక్షోభదమైన శక్తిధరుశక్తిన్ ఱొరొమ్ముభిన్నంబుఁగాఁ
గీలాలంబులఁ గ్రిక్కుచుంబడియె నాకిద్వేషి దైత్యాళుల
ట్లా లేఖుల్ గుఱిపించుచుండ నొగిదుఃఖానంద బాష్పాంబులా
భీలప్రకీర్ణవాత సంహత మహాపృథ్వీధ్రముంబోలుచున్.

క. నాక నదీసలిలకణా । స్తోకశిశిరగంధలోభసుమనోభృంగా
నీకసురద్రుమ సుమశో। భాకరవర్షంబుకుఱిరిసెబర్హిరథుపయిన్.

సీ. అంచందమునఁ దుషారాచల కన్యకా నందసంవర్ధనుఁ డిం
దుమూడ । సంప్రాప్త నిఖిలాస్త్రశస్త్రిందు స్కందుండు
తారకాసురుని యుద్ధంబునందుఁ । గడతేర్చి దేవతాగణ
ములనెల్ల సమ్మోదసాగరమున మునుఁగఁజేసి। సంక్రంద
నాది నిర్జరులెల్ల రరుగుదే రగ రయంబున నమరావతిఁజని

తే. గీ. యమరవిభునకు నాకరాజ్యాభిషేక। మాచరించి సమస్త
దేవాళిమకుట । ఘటిత దివ్యమణి ప్రభాపటలబాల । భా
స్కరాతప రాజితపాదుఁజేసె. 65

క. అటులింద్రుఁడు రాజ్యము నె। ప్పటియట్లు పరిగ్రహించి పర
మేశకృపా। పటలార్ద్రుఁడు వైభవలం। పటుఁడై తన
వారి నెల్లఁ బరిపాలించెన్. 66

శా. నటరాజాచ్యుతపాదసేవనపరా నందద్యశః కాంతది
క్తట ధీమజ్జనతాగ్రిణీ రసకవిత్వభ్రాజిసద్గ్రంథసం
ఘటనాకౌశలసన్నిధాన గుణసంఘూ ఘ్యా కోమాండూరువేం
కట రామానుజనామధేయ కరుణాకల్లోలితాక్షిద్వయా.

క. శ్రీవిద్యావినయాది। శ్రీవిలసిత సతతనైజశిష్యసుబోధ
ప్రావీణ్యచణవచస్క। సేవితరంగా దయావిశిష్టోన్మనసా.

మాలిని. నళినవయనభక్తా న్యాయమార్గానురక్తా
కలికలుషవిదూరా కావ్యనిర్మాణచారా
చలితబుధసమర్చా సత్కృతి వ్యాప్తచర్చా
విలసితగుణజాలా విజ్ఞతైకాలవాలా.

గద్య:—ఇది శ్రీమద్బాలాత్రిపురసుందరీ ప్రసాదాసాది
తానవద్యకవితా యోగహృద్య భారద్వాజగోత్రపవిత్ర
మహితాపస్తంబసూత్ర లక్ష్మీనారాయణ యజ్వపుత్ర
గురుజనాశీర్వచనపాత్ర విజ్ఞజన విధేయ యజ్ఞనారా
యణ నామధేయ ప్రణీతంబగు కుమారవిజయం
బను ప్రబంధంబునఁబంచమాశ్వాసము
సంపూర్ణము.

యదక్షరపదభ్రష్టం
మాత్రాహీనంతుయద్భవేత్
తత్సర్వంక్షమ్యతాందేవ
నారాయణ నమోస్తుతే.

## ప్రోత్సాహక చందాదారులు.

మ రా-రా-శ్రీ అత్తివరపు వెంకటరామరెడ్డిగారు, మాదిరాజు గూడూరు
,, గునుపాటి వెంకటరమణారెడ్డిగారు, కొత్తూరు.
,, అనం చెంచుసుబ్బారెడ్డిగారు నెల్లూరు.
,, తిక్కవరపు రామచంద్రారెడ్డిగారు, రేబాల.
,, వాశెం లక్ష్మీనరసింహంశెట్టిగారు, నవాబుపేట.
,, పిగకాల సుబ్బారెడ్డిగారు, అల్లూరు వంగోలు, గుంటూరు
,, చిట్టమూరు వెంకటరెడ్డిగారు, రాజవోలు, ఆత్మకూరు.
వేమన వీరయ్యనాయుడుగారు సోదరులు కరటంపాడు.

## ఏల్లి కార్యస్థానముల వెలకు దొరకు గ్రంథములు.

| | |
|---|---|
| ...జ్ఞసేనీయము | 1— 0— |
| ...భిమన్యు జన్యము | 0—12—0 |
| ...రి మాహాత్మ్యము. ఆ-రి | 0—12—0 |
| ...వమణము | 1— 0—0 |
| ...ర్జునము | 0—10—0 |
| ...ండ వేంగమాంబా విజయము. | 0—12—0 |
| ...పరిణయము | 0—12—0 |
| ...మథనము, విష్ణుమాయావిలాస నాటకము. | 0—14— |
| ...శ్రీవపట్టాభిషేకము | 0—12. |
| ...వాసరము. | 0— |
| ...రాపశలికము. | 0— |

వత్రి...

